నోరూరించే... మనసునుదోచే... మైమరపించే.






క్రొత్త పార్లే

# పాపిన్స్

## పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

5 పండ్ల సువాసనలలో 13 మధురమైన బిళ్ళలు.
తక్కువ వెలగల మక్కువ గొలిపే ప్రతి ప్యాక్‌లో—
నిమ్మ, మూసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరి!

ఆ పండ్ల మజా తెలుసుకోండి పాపిన్స్ నారగించండి-

everest/122/PP tel

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ, మాకు తెలపాలి. ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ కొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26





# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికతో "రాతిరథం" రంగుల బొమ్మ సీరియల్ ముగిసిపోతున్నది. పై నెల నుంచి మరొక కొత్త సీరియల్ ప్రారంభమవుతుంది.

"అబూకీర్-అబూసీర్" అన్న పెద్ద కథ కూడా ఈ సంచికతో పూర్తి అయింది. "మంచి చెడ్డలు" [బేతాళ కథ] లో మంచి నీతి ఉన్నది. మనకు మేలు చేసే వారందరూ సంఘానికి మంచి వాళ్ళు కాక పోవచ్చు. అలాటి వాళ్ళ నైజం ఎరిగిన వాళ్ళు వారి నుంచి ఉపకారం పొందరాదు.

సంపుటి 50 ఏప్రిల్ '72 సంచిక 4










కర్మాయత్తం ఫలం పుంసాం,
బుద్ధిః కర్మానుసారిణీ ;
తథాపి సుధియా భావ్యం
సువిచార్యైవ కుర్వతా. 1

[మనుషులకు వారి కర్మలను బట్టి ఫలం ఉంటుంది. కర్మను బట్టి బుద్ధి నడుస్తుంది. అయినా బుద్ధిమంతుడు ఆలోచించే పనులు చేయాలి.]

కుదేశం చ, కువృత్తిం చ,
కుభార్యాం, కునదీం, తథా,
కుద్రవ్యం చ, కుభోజ్యం చ
వర్జయేత్తు విచక్షణః. 2

[చెడ్డ దేశాన్ని, చెడ్డ వృత్తినీ, చెడ్డ భార్యనూ, చెడ్డ నదినీ, చెడ్డ ధనాన్ని, చెడ్డ భోజనాన్ని వివేకి విడిచిపుచ్చాలి.]

యో ధ్రువాణి పరిత్యజ్య
అధ్రువం పరిషేవతే,
ధ్రువాణి తస్య నశ్యంతి,
అధ్రువం నష్టమేవ చ. 3

[స్థిరమైన వాటిని విడిచిపెట్టి, అస్థిరమైన వాటిని అవలంబించే వాడికి స్థిరమైనవి లభించవు, అస్థిరమైనవి దక్కవు]

తగినవీ - తగనివీ



# మాయకుందేలు

ఒక జమీందారీ గ్రామం సమీపంలో ఒక ముసలిదీ, ఆమె మనవడూ ఉండేవారు. వాళ్ళు కటిక బీదరికం అనుభవిస్తూ, పావలా డబ్బులు కంటపడితే మహాభాగ్యం అనుకునేవాళ్ళు.

ఆ పరిస్థితిలో ముసలిదానికి ఒక ఆలోచన వచ్చింది. ఆమెకు ఒకే ఒక మంత్రం తెలుసు. ఆ మంత్రం సహాయంతో ఆమె కుందేలుగా మారగలదు. ఈ మంత్రంతో కాసిని డబ్బులు సంపాదించుకోవచ్చునని ఆమె అనుకున్నది.

ఆ వూరి జమీందారుకు వేట అంటే తగని వ్యామోహం. ఫలాని చోట కుందేలు కనిపించిందని ఎవరన్నా చెబితే ఆయన డబ్బులిస్తాడు. దారిద్ర్య బాధకు తట్టుకోలేక ముసలిది ఒకనాడు తన మనవడితో, "బాబూ, నువు జమీందారుగారి దగ్గిరికివెళ్ళి, చింత తోపు దగ్గిర కుందేలు కనిపించిందని చెప్పు. ఆయన నీకు డబ్బు లిస్తారు, పట్టుకురా. నేను పంపానని ఎవరికీ చెప్పకు సుమా. ప్రమాదం!" అన్నది.

మనవడు ఆమె చెప్పినట్టే జమీందారు గారింటికి వెళ్ళి, చింతతోపు దగ్గిర కుందేలు ఉన్నదని చెప్పాడు. జమీందారు వాడి చేతిలో ఒక పావలా పెట్టి, వేటకుక్కలను తీసుకుని కుందేలు కోసం ఉత్సాహంగా బయలుదేరాడు.

కుర్రవాడు చెప్పినట్టే తోపు దగ్గిర ఒక కుందేలు చెవులు రిక్కించి కూర్చుని కనపడింది. జమీందారు వెంటనే తన వేట కుక్కలను వదిలాడు. కాని అవి దగ్గిరికి వచ్చేలోపుగా కుందేలు పొదల చాటుకు పారిపోయి, వెనక్కు మళ్ళి ఇంటికి చేరుకుని తిరిగి ముసలిది అయిపోయింది.

జమీందారు కుందేలు కోసం ఆ ప్రదేశమంతా గాలించి, ఇంటికి తిరిగి వెళ్ళాడు.

ఏ. ధర్మారావు

అటు తరవాత చాలాసార్లు కుర్రవాడు జమీందారు వద్దకు వెళ్ళి ఫలాని చోట కుందేలు ఉన్నదని చెప్పి పావలా డబ్బులు పుచ్చుకోవటమూ, జమీందారు వేటకు బయలుదేరటమూ, కుందేలు కనిపించి కూడా అదృశ్యం కావటమూ జరిగింది.

"జమీందారుగారిచ్చే డబ్బులతో మనకు జరుగుబాటు అవుతున్నదేగాని, మనం చేసేది చాలా ప్రమాదకరం, నాయనా. మన రహస్యం ఎవరికిగాని చేప్పేవు సుమా! ఈ పాటికి వాళ్ళకే అనుమానం కలిగి ఉండాలి," అన్నది ముసలిది మనవడితో.

ముసలిది భయపడ్డంతా అయింది. జమీందారుకు అనుమానం కలగనే కలిగింది. ప్రతిసారీ కుందేలు వేట కుక్కలకు అందకుండా పారిపోయి అదృశ్యం కావటంలో ఏదో మోసం ఉన్నదని ఆయన అనుకున్నాడు.

అందుచేత ఈసారి కుర్రవాడు కుందేలు వార్త తెచ్చేసరికి ఆయన వేటకుక్కలతో సిద్ధంగా ఉండి, ముందే వాటిని వదిలేశాడు. కుందేలుకు మనుషులు కనపడేలోపునే వేట కుక్కలు వచ్చి మీద పడ్డాయి. కుందేలు శక్తికొద్దీ పరిగెత్తింది.

కుందేలును వేటకుక్కలు ముసలిదాని పాక దాకా తరిమాయి. చిన్న బొరియలో నుంచి కుందేలు పాకలోకి దూరిపోయింది. వేట కుక్కలు బయట నిలబడి మొరుగుతున్నాయి. జమీందారు వచ్చి తలుపు తట్టాడు. తలుపు తీసిన ముసలిది ఆయాసంతో విపరీతంగా రొప్పుతున్నది.

జమీందారు కోపంగా, "నువేనా కుందేలువు? ఏమిటి నీ ఎత్తు?" అని అడిగాడు.

ముసలిది ఏడుస్తూ ఆయనకు తమ దారిద్ర్యబాధ చెప్పుకుని, తానూ, తన మనవడూ బతకటానికి తనకు తెలిసిన మంత్రం తప్ప మరొక మార్గం లేకపోయిందనీ, తనను క్షమించమనీ అన్నది.

ముసలిది ఆ వయసులో మనవడి పోషణ కోసం పడుతున్న పాట్లు చూసి జాలిపడి, జమీందారు వాళ్ళకు సహాయపడ్డాడు. ఆ తరవాత ముసలిదీ, మనవడూ సుఖంగా బతికారు.





# అదృశ్యకరణి

ఒకప్పుడు ఒక గ్రామంలో పరమనీచుడైన భూస్వామి ఒకడు ఉండేవాడు. బిచ్చగా ళ్ళెవరూ అతని ఇంటి చాయలకు రావ టానికి వీల్లేదు; వస్తే వాళ్ళను తిట్టి వెళ్ళ గొట్టటంతో పోక, వాళ్ళు మళ్ళీ రాకుండా కుక్కలను వాళ్ళ మీదికి ఉసి కొల్పేవాడు.

ఒకసారి ఆ ప్రాంతాల తీవ్రమైన తిండి కరువు వచ్చింది. అలాటి కరువు ఎన్నడూ ఎరగరు గ్రామస్థులు. వాళ్ళు కడుపు నిండా తింటే ఎలా ఉంటుందో కూడా మరిచి పోయారు. భూస్వామి వద్ద చాలా ధాన్యం ఉన్నదని వాళ్ళకు తెలుసును. కాని జనం ఎంత ప్రాధేయపడినా ఆ కర్కోటకుడి మనసు కరగలేదు.

ఆ పరిస్థితిలో ఒక యువకుడు ఆ భూస్వామి మనస్సు కరిగించి ధాన్యం తెస్తానని బయలుదేరాడు. వాడు భూస్వామి ఇంటి ముందున్న తోటలోకి ప్రవేశించి, ఒక ఎత్తయిన చెట్టు కింద కూర్చుని దీక్షగా చెట్టు కొమ్మలలోకి చూడసాగాడు.

భూస్వామి అప్పుడే భోజనం చేసి కిటికీ వద్దకు వచ్చి, బయటికి చూసేసరికి ఆ కుర్ర వాడు కనిపించాడు. వాడేదో దుర్బుద్ధితో పచ్చాడనుకుని భూస్వామి, "ఎవర్రా అదీ? ఏం చేస్తున్నావక్కడ?" అని కేక పెట్టాడు.

యువకుడు ఆ కేకలేవీ వినిపించుకో కుండా అలాగే చెట్టులోకి పరీక్షగా చూస్తూ ఉండి పోయాడు.

భూస్వామి బయటికి వచ్చి, యువకుణ్ణి సమీపించి, "ఏమిటి అలా చూస్తున్నావని అడిగితే పలకవేం? చెపుదా?" అన్నాడు.

"మరేం లేదు. గూడు కోసం చూస్తు న్నాను. నిన్న అగ్నిపక్షి ఈ చెట్టు మీద వాలటం చూశాను. ఇక్కడ ఆ పక్షి గాని గూడు పెట్టిందో, అందులో మంత్రపు మూలిక ఉంటుంది. మీకు మాత్రం

చీనా జానపద కథ

తెలీదా? ఆఁ! అదుగో గూడు!" అన్నాడు యువకుడు.

"మంత్రపు మూలికా? ఏమిటా మంత్రం?" అని భూస్వామి అడిగాడు.

"అదొక అపూర్వమైన మూలిక. వెయ్యేళ్ల కొకసారి పూస్తుంది. ఆ పూత కాయ కావటానికి మరో వెయ్యేళ్ళు పట్టుతుంది. కాని దాని చిన్న రెమ్మలో కూడా అద్భుతశక్తి ఉంటుంది," అన్నాడు యువకుడు.

"ఏమిటి దానికుండే అద్భుతశక్తి? ఆ మాట చెప్పవేం?" అన్నాడు భూస్వామి చిరాకుగా.

"ఒకటేమిటంటే, దాని చిన్న కాడ తలలో పెట్టుకున్నా మనం అదృశ్యమై పోతాం. మనని ఎవ్వరూ చూడలేరు. అప్పుడు మనం ఏది పడితే అది చెయ్యొచ్చు. ఇంకొకటేమిటంటే—"

అని యువకుడు చెప్పబోతుండగానే భూస్వామి, "పో ముందు ఇక్కణ్ణుంచి!" అని అరిచి హంగామా చేశాడు.

యువకుడు చుట్టూ చూసి, "ఇక్కడెవరూ లేరే? ఎవరి మీద కేక లేస్తున్నారు?" అన్నాడు తాపీగా.

"నిన్నే పొమ్మంటున్నాను. ఆ మూలిక నాది. ఇది నా తోట!" అంటూ భూస్వామి మరింత గట్టిగా అరిచాడు.

"అలాగా? దాన్ని కనిపెట్టిన వాణ్ణి నేను. దాన్ని ధ్వంసం చెయ్యటం నా చేతిలో ఉన్నది," అంటూ యువకుడు చెట్టెక్కనారంభించాడు.



"ఆగు! ఒక క్షణం ఉండు! నీకు యాభై బంగారు కాసు లిస్తాను," అన్నాడు భూస్వామి.

"క్షమించాలి. దాన్ని అంత చవుకగా అమ్మలేను," అన్నాడు యువకుడు.

భూస్వామి బేరానికి దిగాడు.

"నాకు డబ్బు అవసరం లేదు. యాభై బస్తాల ధాన్యం ఇప్పిస్తే ఆ మూలికను మీకు వదిలేస్తాను," అన్నాడు యువకుడు.

భూస్వామి బలవంతాన ఒప్పుకున్నట్టు ఒప్పుకున్నాడు. యువకుడు ధాన్యం పట్టుకు పోయి దాన్ని గ్రామంలో ఉండే బీదకూ, బిక్కకీ పంచి పెట్టేశాడు.

ఈ లోపల భూస్వామి తన నౌకర్ల చేత చెట్టు మీది నుంచి గూడు దింపించి, తన భార్య దగ్గిరికి పట్టుకు పోయి, "ఏం జరిగిందో చెప్పుకో!" అన్నాడు ఆనందంతో పొంగిపోతూ.

"నాకేం తెలుస్తుంది? ఎవడి నెత్తినో చెయ్యి పెట్టి ఉంటావు!" అన్నది భార్య.

"నువు కనుక్కోలేవులే. ఒక మంత్రపు మూలిక సంపాదించాను. దానితో మనం అంతులేని డబ్బు సంపాదించుకుంటాం," అన్నాడు భూస్వామి.

అతని భార్య గూడు కేసి అనుమానంగా చూస్తూ, "ఇదేనా మంత్రపు మూలిక?" అన్నది. దాని నిండా పుల్లలూ, గడ్డిపోచలూ ఉన్నాయి.

"ఈ పుల్లలలో మంత్రపు మూలిక ఏదో మనం తెలుసుకోవాలి. నేను ఒక్కొక్కటే



నెత్తిన పెట్టుకుంటాను. ఎప్పుడు కనపడకుండా పోతానో నువు చెప్పాలి," అన్నాడు భూస్వామి.

అతను ఒక్కొక్క పుల్లే ఏరి నెత్తిన పెట్టుకోవటమూ, "నేను కనిపిస్తున్నానా?" అని అడగటమూ, అతని భార్య, "అహా, కనిపిస్తూనే ఉన్నావు." అనటమూ చాలాసార్లు జరిగింది.

చివరకు భార్య విసిగి, "నాకేమీ కనిపించటం లేదు, పో!" అని లేచి వెళ్ళిపోయింది. అప్పుడు తన నెత్తిన ఉన్నదే మంత్రపు మూలిక అనుకుని, దాన్ని తన జుట్టులో ఇరికించుకుని ఆ మూఢుడు నగరంలోకి బయలుదేరాడు.

వీధిలో పోతూండగా గుప్పున తినుబండారాల వాసన తగిలింది అతనికి. తన సమీపంలో ఉన్న దుకాణంలో నుంచి రెండు అట్లు తీసుకుని అవురావురున తినేసి ముందుకు సాగాడు.

దుకాణదారుకు భూస్వామి తెలుసు. భూస్వామి తొందరగా ఎక్కడికో పోతూ డబ్బులు ఇవ్వలేదని, తిరిగి వచ్చేటప్పుడు ఇస్తాడు లెమ్మనీ దుకాణదారు అనుకుని మాట్లాడకుంటా ఊరుకున్నాడు.

తాను అదృశ్యంగా ఉండటం చేతనే దుకాణదారు డబ్బులు అడగలేదనుకున్నాడు భూస్వామి. అంతటితో అతనికి మరింతధైర్యం వచ్చింది.

మరొక దుకాణంలో ఉండే వర్తకుడు దుకాణం మూసి వెయ్యబోతూ, ఆ రోజు వసూలయిన డబ్బంతా తన ముందు పోసుకుని, ఎంచి బొత్తులు పెడుతున్నాడు. ఆ డబ్బు చూసేసరికి భూస్వామి కళ్ళు తిరిగి పోయాయి. అతను దగ్గిరికి వెళ్ళి, చెయ్యిచాచి డబ్బంతా కాజెయ్యబోయాడు.

వెంటనే వర్తకుడు భూస్వామి చెయ్యి గట్టిగా పట్టుకుని, "దొంగ! దొంగ!" అని కేక పెట్టాడు. అన్ని పక్కల నుంచి జనం వచ్చిపడి, భూస్వామిని చచ్చేట్టు తన్నారు. చావుతప్పి కన్ను లొట్టపోయినట్టయి భూస్వామి పడుతూ, లేస్తూ కొంప చేరుకున్నాడు.





# రాతిరథం

## 19

[ఖడ్గ జీవదత్తులు పూజారినీ, ఆచారినీ వెంటబెట్టుకుని అరణ్యంలోకి పోయారు. అక్కడ ఒక చెట్టు కింద పులిపిల్లలను పట్టుకుని కేకలు పెడుతున్న యువకు డొకడు వాళ్ళకు కనిపించాడు. ఖడ్గ జీవదత్తులు అతణ్ణి సమీపించేంతలో, ఖడ్గమృగం మీద సవారీ అయిన వాడొకడు ముందుకు వచ్చి, వాళ్ళను చుట్టుముట్టి పట్టుకోమని అరిచాడు. తరవాత—]

ఖడ్గమృగం మీద ఎక్కి వచ్చినవాడు తన అనుచరులకు చేసిన హెచ్చరిక వింటూనే ఖడ్గ జీవదత్తులు తమకు ప్రమాదం రాబో తున్నదని గ్రహించారు. ఆ మరుక్షణం జీవ దత్తుడు దండంతో ఖడ్గమృగం మీద వున్న వాడి తల మీద కొట్టాడు. వాడు, "అరణ్య మాతా!" అంటూ కిందబడిపోయాడు.

"ఒరే, అరణ్యమాత పుత్రుల్లారా! మీమీ ఆయుధాలు కింద పడవేసి లొంగిపొండి. లేకపోతే మీకు చావు తప్పదు. మీ నాయ కుడికి పట్టిన అవస్థ చూశారుగదా?" అంటూ గట్టిగా కేక పెట్టాడు జీవదత్తుడు.

"పెంపుడు పులిని మీదికి వదలమంటారా, చెట్ల చాటు నుంచి బయటికి వస్తారా?" అన్నాడు ఖడ్గవర్మ.

నలుగురు ఆటవికులు చేతులు పైకెత్తి చెట్లచాటు నుంచి ముందుకు వచ్చారు. వాళ్ళ దగ్గిర వున్నవి రాతి ఆయుధాలు.




"మీ మీ ఆయుధాలు యిక్కడ కింద పడవేయండి," అంటూ జీవదత్తుడు ఆటవికులను హెచ్చరించి, ఖడ్గవర్మతో, "వీళ్ళు ఆటవికుల్లో కూడా బాగా వెనకబడిన జాతి వాళ్ళలా వున్నారు. సరే, ఈ పులి నోట తల పెట్టాలని వచ్చిన యువకుడు వింధ్య పర్వతాల కేసి వెళ్ళే మనకు మరొక కొత్త సమస్య తెచ్చి పెట్టాడు," అన్నాడు.

జీవదత్తుడు యిలా అనగానే యువకుడు, "అయ్యా, నన్ను కూడా మీ వెంట తీసుకు పొండి. పులి నుంచి కాపాడి నన్ను అరణ్య పురం గణాచారికి ఒప్పచెప్పకండి. వాడు నన్ను చిత్రహింసలకు గురి చేస్తాడు," అన్నాడు ఏడ్పుగొంతుతో.

జీవదత్తుడు ఏదో జవాబివ్వబోయేంతలో, పూజారీ, స్వర్ణాచారీ అక్కడికి వచ్చారు.

"మీ ఇద్దరూ యింకా బతికే వున్నారా? యిప్పటివరకూ ఎక్కడున్నారు?" అని అడిగాడు ఖడ్గవర్మ యీసడిస్తున్నట్టు.

"మహాశూరుల్లారా! మేము వృక్ష శాఖల్లో వుండి, మీ శౌర్య పరాక్రమాలను అబ్బురపాటుతో తిలకిస్తున్నాం!" అన్నాడు విఘ్నేశ్వరపూజారి.

"అక్కడే వుండి తిలకించక మరి దిగా రెందుకు? జీవా! ఇక మనం యీ చచ్చు పుచ్చు వెధవ లందర్నీ యిక్కడొదిలి మన దారిన మనం పోదాం. వాళ్ళ గొడవేదో వాళ్ళు పడతారు," అన్నాడు ఖడ్గవర్మ.

"ఖడ్గా, తొందరపడకు. వీళ్ళను అంత తేలిగ్గా వదలటం సాధ్యమయేది కాదు," అని జీవదత్తుడు ఖడ్గవర్మను మందలించి యువకుడికితో, "నీ పేరేమిటి? ప్రమాదం తప్పింది గనక, ఆ అరణ్యపురం గణాచారికి అందకుండా మరెక్కడికైనా పోయి బతకలేవా?" అని అడిగాడు.

"నా పేరు అరణ్యమల్లు. గణాచారి కంట బడకుండా, యీ అరణ్యంలో బతగ్గ లగటం ఎవరి తరమూ కాదు. నన్ను కూడా మీ వెంట తీసుకుపొండి. వాడు మోసంతో నా సింహాసనాన్ని ఆక్రమించాడు," అన్నాడు యువకుడు.




"సరే, పనిలో పనిగా నీ సమస్య కూడా పరిష్కరించి పోతాం. ఆ గణాచారి ఎలాంటి మోసంతో నిన్ను అధికారంనుంచి తొలగించాడు?" అని అడిగాడు జీవదత్తుడు.

అరణ్యమల్లు జరిగినదంతా క్లుప్తంగా చెప్పాడు. అరణ్యపురానికి అరణ్యమల్లు తండ్రి రాజు. అతడు మూడు నెలల క్రితం మరణించాడు. ఆ నాటి నుంచీ గణాచారి అరణ్యమల్లును సింహాసనం నుంచి తొలగించేందుకు చాలా యుక్తులు పన్నాడు. అవేవీ పారలేదు. చివరకు వారం రోజుల క్రితం గణాచారి అరణ్యమాత ఆలయంలో కుల పెద్దలందరినీ పోగు చేసి, రాజ్యపాలనకు అరణ్యమల్లు పనికిరాడని అరణ్యమాతే స్వయంగా తనకు చెప్పిందనీ, కావాలంటే మరో మారు ఆ మాత నోటి నుంచే ఆ సంగతి అందరూ వినవచ్చనీ అన్నాడు.

ఆ తరవాత అరణ్యమాత విగ్రహానికి ధూపం వేసి, "మాతా! ఈ రాజ్యసింహాసనానికి అరణ్యమల్లు అర్హుడా? లేక మరెవరైనా అందుకు తగిన వాళ్ళు వున్నారా?" అని అడిగాడు గణాచారి.

ఆ వెంటనే విగ్రహం నోటిలో నుంచి, "మల్లు అనాచారి! రాజ్యపాలనకు అనర్హుడు. నా గణాచారివైన నువ్వు సింహాసనం ఎక్కితే, రాజ్యం అంతా సుభిక్షంగా వుంటుంది," అన్న మాటలు వెలువడ్డాయి.

"వినండి! వినండి! కుల పెద్దలారా!" అంటూ గణాచారి గంతులు వేయసాగాడు. అరణ్యమల్లు మాత్రం ఎక్కడలేని కోపంతో దిగ్గున పోయి, ఒక రాతి గదతో అరణ్యమాత విగ్రహాన్ని బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు విగ్రహం చేయొకటి విరిగి పోయింది.

"అపచారిని పట్టుకోండి! చిత్రవధ చేసి చంపండి!" అంటూ గణాచారి కేకలు వేశాడు.

అక్కడ చేరిన వాళ్ళల్లో కొందరు లేచి అరణ్యమల్లును పట్టుకోవాలని చూశారు. కాని, అరణ్యమల్లు ఎలాగో వారి బారి నుంచి తప్పించుకుని, అరణ్యం చేరాడు.




అయినా గణాచారి అనుచరులు అతడి కోసం అరణ్యం అంతా గాలిస్తూనే వున్నారు. ఇక తను తప్పించుకు పోగలగటం అసంభవం అనుకుని అతడు పులి నోట పడేందుకు ప్రయత్నించాడు.

"రాతివిగ్రహాల చేత మాటలు పలికించే, ఆ గణాచారి ఎలా వుంటాడో చూడాలని వుంది. మీ అరణ్యపురానికి దారి తియ్యి, మల్లూ!" అన్నాడు జీవదత్తుడు.

అరణ్యమల్లు కొంచెంగా వణుకుతూ, "సరాసరి అరణ్యపురానికి బయలుదేరి పోవటమా? వాడికి చాలామంది అనుచరులు వున్నారు. వాళ్ళందరికీ వాడి మహత్తులో పెద్ద నమ్మకం కూడా వుంది." అన్నాడు.

ఖడ్గవర్మ చిన్నగా నవ్వి, ఖడ్గమృగ నాయకుణ్ణి, "మా వెంట అరణ్య పురానికి వచ్చి, మాకు సాయంగా వుంటావా? లేక యిప్పుడే నా పెంపుడు పులికి ఆహారం అయిపోతావా?" అని అడిగాడు.

ఖడ్గమృగ నాయకుడు నిలువెల్లా వణికి పోతూ, "అయ్యా, మమ్మల్ని కరుణించండి. ఈ అరణ్యమల్లు అనాచారి అని అరణ్యమాత చెప్పింది. అలాంటి వాడికి మేమెలా సహాయపడగలం!" అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గమృగ నాయకుడితో, "ఆ నిజానిజాలు నిలకడ మీద గాని తేలవు. ముందుండి మీ అరణ్యపురానికి దారి తీయండి." అన్నాడు.

అందరూ అరణ్యపురం కేసి బయలు దేరారు. ఖడ్గవర్మ పులిపిల్లలను భుజం మీద పెట్టుకుని, అడవి తీగ మెడకు కట్టి వున్న తల్లి పులిని వెంట వేసుకుని బయలు దేరాడు. అరణ్యమార్గాల వెంట చాలా దూరం ప్రయాణించి సూర్యాస్తమయ సమయంలో వాళ్ళు అరణ్యపురాన్ని చేరారు. వాళ్ళను చూసి గణాచారీ అతడి అనుచరులూ భయకంపితులై పోయారు.

జీవదత్తుడు దండం పైకెత్తి పెద్ద గొంతుతో, "అరణ్యపురం గణాచారీ, చెప్పేది శ్రద్ధగా విను! మీ అరణ్యపురం అంటే ఏదో నగరంలా వుంటుందనుకున్నాను. గుహలూ, రాళ్ళూ



రప్పలూ చేర్చి కట్టిన పిచ్చుకగూళ్ళలా వున్నది మీ పురం. సరే, దీన్ని యీ క్షణం లోనే నా మంత్ర శక్తితో భస్మం చేయగలను. కాని, మీ అరణ్యమాత మహత్తు గురించిన నిజానిజాలు తెలుసుకున్న తరవాత ఆలోచిద్దామని వదిలేస్తున్నాను. నేను వచ్చిన పనేమిటో, నీ ఖడ్గమృగ నాయకుడు చెపుతాడు, విను!'' అన్నాడు.

ఖడ్గమృగ నాయకుడు, గణాచారికి అరణ్యంలో జరిగినదంతా చెప్పాడు.

గణాచారి యిదంతా విని మరింతగా భయపడిపోయి, ఖడ్గ జీవదత్తుల దగ్గిరకు వచ్చి వంగి నమస్కారం చేసి, ''అయ్యలారా! మీ వెంట వున్న అరణ్యమల్లు మాతకు చాలా అపచారం చేశాడు. మాత స్వయంగా తన నోటితో సింహాసనం ఎక్కేందుకు నేను తగిన వాణ్ణని చెప్పింది. మాత మాటలు విన దలిస్తే, ఈ రాత్రి పది గంటల వేళకు మీరు ఆమె మందిరానికి రావచ్చు,'' అన్నాడు.

''తప్పక వస్తాం. అరణ్యమాత వాక్కులు మా చెవులారా విని, యీ అరణ్యమల్లును మా పెంపుడు పులికి మీ ఎదటనే ఆహారంగా చేసి, మా దారిన మేం పోతాం,'' అన్నాడు జీవదత్తుడు.

''మహామాంత్రికుల్లారా! ధన్యుణ్ణి. మీ విశ్రాంతికీ, భోజనాలకూ ఏర్పాట్లు యిప్పుడే చేస్తాను,'' అన్నాడు అరణ్యపురం గణాచారి.

అతడి అనుచరులు ఖడ్గ జీవదత్తుల్నీ, వాళ్ళ వెంట వున్న వాళ్ళనూ ఒక శిధిల భవనానికి తీసుకుపోయి అందులో విడిది ఏర్పాటు చేశారు.

అది పౌర్ణమి రాత్రి. చంద్రకాంతిలో అరణ్యపురం, ఆ పరిసరాలనున్న కొండలూ, అరణ్యాలూ వెలిగిపోతున్నవి. సరిగా పది గంటల వేళ గణాచారి అనుచరు డొకడు వచ్చి ఖడ్గ జీవదత్తులను అరణ్యమాత మందిరానికి రావలసిందిగా ఆహ్వానించాడు. విఘ్నేశ్వరపూజారినీ, స్వర్ణాచారినీ వెంటబెట్టుకుని వాళ్ళు మందిరానికి వెళ్ళారు. అక్కడ ఆ సరికే గణాచారీ అతడి జాతివాళ్ళూ కూర్చుని వున్నారు.



ఖడ్గ జీవదత్తులు అరణ్యమాత విగ్రహం దగ్గిరకు పోయి, విగ్రహాన్ని పరీక్షగా చూశారు. విగ్రహం నిలువెత్తున వున్నది. ఒక చేయి విరిగి పోయి వున్నది. దాని రెండవ చేతిలో ఒక పెద్ద రాతి గద వున్నది. విగ్రహం పెద్దగా నోరు తెరిచి వున్నట్టు చెక్కబడింది.

గణాచారి విగ్రహం ముందున్న పళ్ళాలలో కణకణలాడుతున్న బొగ్గుల మీద సాంబ్రాణి వేసి, గుప్పుమంటూ పొగ లేవగానే ఏవో మంత్రాలు చదువుతూ కొంచెం సేపు అటూ ఇటూ గంతులు వేసి, తన అనుచరుడొకడు తెచ్చియిచ్చిన పళ్ళూ ఫలాలున్న పాత్రతో విగ్రహం ముందుకుపోయి, ఒకటి రెండు అరటిపళ్ళను తెరిచి వున్న విగ్రహం నోట్లోవేసి, "మాతా! మరొకసారి పలుకు. ఈ రాజ్యాన్ని పాలించేందుకు అర్హుణ్ణి నేనా లేక అరణ్యమల్లుడా?" అన్నాడు.

వెంటనే విగ్రహం నోటిలోంచి, "అరణ్యమల్లు అనాచారి. నా చేయి విరక్కొట్టాడు. గణాచారీ! రాజ్యాన్ని నువ్వే పాలించు. ఆ మల్లును నాకు బలి యివ్వు!" అన్న మాటలు వినిపించినై.

"వినండి! వినండి! మాత పలికింది!" అంటూ గణాచారి గెంతసాగాడు.

జీవదత్తుడు చిన్నగా నవ్వి ఖడ్గవర్మ చెవిలో ఏదో చెప్పాడు. వెంటనే ఖడ్గవర్మ పులి దగ్గిరకు పోయి కత్తిదూసి నిలబడ్డాడు. జీవదత్తుడు, గణాచారి కేసి ఓ మారు చూసి విగ్రహం ముందు ఎర్రగా కాలి సాంబ్రాణి పొగలు విరజిమ్ముతున్న బొగ్గుల పళ్ళాన్ని రెండు చేతులతో ఎత్తి, ఆ కాలే బొగ్గులను తెరిచి వున్న అరణ్యమాత నోటిలో పోశాడు. మరుక్షణం విగ్రహం పొట్టలో నుంచి చావు కేక ఒకటి వినిపించింది. అందరూ ఆశ్చర్యపడి చూసేంతలో, విగ్రహం వెనక వున్న ఒక కొయ్య భోషాణం తలుపు తెరుచుకుని, కాలుతున్న గుడ్డలతో ఒక ఆటవికుడు బయటికి వచ్చి పడ్డాడు.

ఇదంతా క్షణాల మీద జరిగిపోయింది. భోషాణం లోంచి తన ఆటవిక శిష్యుడు కేకలు వేస్తూ బయటికి రావటం చూస్తూనే

గణాచారి కూడా ఒక చావు కేక పెట్టి మంది రంలో నుంచి బయటికి పరిగెత్త సాగాడు. వాడు మందిర ద్వారం దాటుతూండగా ఖడ్గవర్మ తన కత్తితో పులికి కట్టివున్న అడవి తీగను నరికి వేశాడు. పులి పారిపోతున్న గణాచారి వెంటబడి మీదికి దూకి వాడి గొంతు పట్టుకున్నది. ఆ సమయానికి పులి పిల్లలు రెండూ తల్లి దగ్గిరకు పరిగెత్తినై.

వెన్నెల కాంతిలో యీ భయంకర దృశ్యాన్ని చూసి ఆటవికులందరూ భయ కంపితులైపోయారు. జీవదత్తుడు వాళ్ళతో, "గణాచారి మోసం తెలుసుకున్నారు గదా! ఇప్పుడు మీకు రాజు కాదగిన వాడెవడో నిర్ణయించుకోండి!" అన్నాడు.

ఆటవికులందరూ ఏక కంఠంతో, "మా రాజు అరణ్యమల్లు!" అని అరిచారు.

"సరే, అరణ్యమల్లు యిక్కడే వున్నాడు. మేం మిద్దె మీదికి పోయి వెన్నెల్లో విశ్రమిస్తాం!" అంటూ జీవదత్తుడు తన అనుచరులతో మిద్దె మీదికి వెళ్ళాడు.

ఆ వెంటనే పెనుగాలి లేచి చుట్టుపక్కల వున్న చెట్టుచేమలు వూగిపోయినై. ఆకా శంలో ఉరుములాంటి చిన్న ధ్వని అయింది. జీవదత్తుడితో పాటు అందరూ తలలు పైకెత్తి చూశారు. దూరం నుంచి నల్లని మేఘం లాంటి దొకటి వారికేసి వస్తున్నది. ఆశ్చర్య భయాలతో వాళ్ళు దానికేసి చూస్తున్నంతలో




అది వాళ్ళ తలల మీదికి వచ్చి ఆకాశంలో ఆగిపోయింది. అది మేఘం కాదు. లోగడ పద్మపుర రాజకుమారి పద్మావతి, ఖడ్గ జీవ దత్తుల కిచ్చిన బొమ్మ రాతిరథాన్ని పోలి వున్నదా రథం.

రథంలో యక్షు డొకడున్నాడు. అతడి పక్కన రాజకుమారి పద్మావతి కూర్చుని వున్నది. యక్షుడు మేఘగర్జనలాంటి కంఠ స్వరంతో, "ఖడ్గ జీవదత్తులారా! ఇక మీరు వింధ్యపర్వతాలకు పోయి రాతిరథాన్ని కదిలించ నవసరంలేదు. ఇదుగో, ఆ రథాన్ని నేను కదిలించి ఆకాశమార్గాన పద్మపురం పోయి, రాజకుమారి పద్మావతిని వివాహం ఆడి, నా పురానికి పోతున్నాను," అన్నాడు.

" ఇది రాజకుమారి అపహరణ కాదుగదా! రాకుమారీ, యక్షుడు చెప్పినది నిజమా?" అంటూ జీవదత్తుడు పెద్దగా కేకపెట్టాడు.

జీవదత్తుడి ప్రశ్నకు జవాబుగా యక్షుడు బిగ్గరగా నవ్వాడు. రాతిరథం జుఁయ్‌మంటూ వేగంగా కదిలి చూస్తూండగానే ఆకాశంలో అంతర్థానమైపోయింది.

"జీవా! మనం పడిన శ్రమ అంతా వృధా!" అన్నాడు ఖడ్గవర్మ నిరాశగా.

" మన శ్రమ ఏమీ వృధా కాలేదు. మనం మహా వీరులం అని రుజువు చేసేందుకు వింధ్యపర్వతాలకు బయలుదేరాం. దారిలో ఎదురైన అన్ని ప్రమాదాలనూ మన బాహు బలంతో జయించి మహా వీరులం అనిపించు కున్నాం. ఎందుకు విచారం?" అన్నాడు జీవదత్తుడు.

" నువ్వన్నది నిజం! మనం యీ అరణ్యా పురంలోనే కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకుని, యీ చుట్టుపక్కల ఏదైనా ఒక రాజ్యాన్ని స్థాపించటం ఎలా వుంటుంది?" అన్నాడు ఖడ్గవర్మ.

"మహా దివ్యంగా వుంటుంది. మన నివాసం ప్రస్తుతానికి యీ అరణ్యాపురమే! రాజ్యస్థాపనా విషయం నిదానంగా ఆలో చిద్దాం," అన్నాడు జీవదత్తుడు.

" మహా శూరులారా! ఆ స్థాపించబోయే రాజ్య ప్రధాననగర నిర్మాణం నాకు వద లండి. వాస్తుశాస్త్రంలో నేను మయుడంతటి వాణ్ణి," అన్నాడు స్వర్ణాచారి.

" నిజం మహాశూరులారా! మీరు కత్తితో జయించలేనిదాన్ని, నేను మాయోపాయంతో సాధించగలను. నేను ఆ విద్యలో శకునికి సాటివాణ్ణి," అన్నాడు విఘ్నేశ్వరపూజారి.

" మీ శక్తి సామర్థ్యాల్లో నాకు గట్టి విశ్వా సమే వున్నది. ఖడ్గా, రాత్రి చాలా పొద్దు పోయినట్టుంది. ఈ వెన్నెల్లో హాయిగా నిద్రిద్దాం," అంటూ జీవదత్తుడు, చదునుగా వున్న ఒక చోటు చూసుకుని పడుకున్నాడు.

అతడితో పాటు ఖడ్గవర్మా, విఘ్నేశ్వర పూజారీ, స్వర్ణాచారీ కూడా చదునైన చోట్లు చూసుకుని పడుకుని, సుఖంగా నిద్ర పోయారు. —(అయిపోయింది)






# మంచి చెడ్డలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, శ్రమపడుతున్నందుకు విచారించకు. లోకంలో సాధారణంగా మంచీ, చెడూ కలిసే ఉంటాయి. అందుకు నిదర్శనంగా నీకు తపతి వృత్తాంతం చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

చాలా కాలం క్రితం నాగపురనగరంలో ఒక వితంతువు నివసించేది. ఆమె పేరు తపతి. లేక లేక పుట్టిన తన కుమార్తెతో పాటు ఆమె, రాజమార్గమూ, రహదారీ కలిసే చోట ఒక పెంకుటింట్లో నివసిస్తూ ఉండేది. ఆ ఇంటి వెనక చిన్న తోట ఉండేది. తపతి తన కోసం కాకపోయినా తన కుమార్తె కోసం ఎంతైనా శ్రమ పడేది.

## బేతాళ కథలు



ఆ పిల్లే ఆమెకు సమస్తమూనూ. వారికిద్దరికీ కాలం సుఖంగానే వెళ్ళి పోతున్నది.

ఇలా ఉండగా చిన్న పిల్లకు ఏదో కంటి జబ్బు వచ్చింది. పిల్ల కళ్ళు ఎర్రబడి, తీపులు పెట్టసాగాయి. తపతి తనకు తెలిసిన చికిత్స ఏదో చేసింది గాని లాభం లేక పోయింది. పిల్ల కళ్ళు వాచాయి.

తపతి కంగారు పడిపోయి కనిపించిన వైద్యులందరినీ సలహా అడిగింది. కొందరు కంటి పూతలు ఇచ్చారు. కొందరు ఏవేవో కట్లు కట్టమన్నారు. పాపం, తపతి ఎవరేది చెబితే అదెల్లా చేసింది. కాని ఒక్క చికిత్సా పని చెయ్యలేదు. పిల్ల బాధపడిపోతున్నది. పిల్ల బాధ చూసి తల్లి ప్రాణం కొట్టుకు పోతున్నది. కంటి జబ్బుతో బాటు పిల్లకు అన్న హితవు లేకుండా పోయింది.

సమీపంలోనే ఏదో ఒక గ్రామంలో ఎవరో మంగలి ఉన్నాడనీ, అతను చాలా రకాల కంటి రోగాలు కుదుర్చుతాడనీ విని, తపతి తన పిల్లను వెంట బెట్టుకుని ఆ గ్రామానికి బయలుదేరింది.

దారిలో మిట్ట మధ్యాన్నం వేళ ఒక చెట్టు కింద కూర్చుని విశ్రాంతి తీసుకుంటూ ఒక ముసలి ప్రయాణీకురాలు కనిపించింది. ఆ ముసలిది తపతిని నీడలోకి ఆహ్వానించింది.

మాటల సందర్భంలో తపతి ఆ ముసలి దానికి తన కూతురి కళ్ళ జబ్బు గురించి చెప్పింది.

అంతా విని ముసలిది, "వెర్రిదానా, అడ్డమైన వైద్యాలూ చేయించి పిల్లదాని కళ్ళు పోగొట్టకు. ఇంకా కొంతదూరం ముందుకు వెళ్ళితే కుడి పక్కగా కాలిబాట కనిపిస్తుంది. ఆ బాటన అరఘడియ సేపు నడిచావంటే అక్కడ ఒక బావి ఉన్నది. దాని నీరు మంచులాగా చల్లగా ఉంటుంది. ఆ నీటితో నీ కూతురి కళ్ళు కడిగావంటే కళ్ళు ఎప్పటిలాగవుతాయి," అన్నది.

తపతి ముసలిదానితో వెళ్ళివస్తానని చెప్పి, తన కూతురితో సహా ముందుకు సాగింది. వాళ్ళిద్దరూ ముసలిది చెప్పిన బావిని చేరే సరికి మూడు ఝాముల పొద్దయింది.



తపతి చేదతో నీరు తోడి, అందులో గుడ్డ ముంచి తన కూతురి కళ్ళు తుడుస్తూ ఉండగా ఆకస్మికంగా ఆమె పక్కన ఎవరో ఒక మనిషి ప్రత్యక్షమయాడు. తపతి ఉలిక్కిపడింది. అతను మామూలు బట్టలే కట్టుకుని ఉన్నాడు గాని, చూడటానికి ఎవరో గొప్పవాడల్లేనే ఉన్నాడు.

"నిన్ను చూసి దడుచుకున్నాను, బాబూ!" అన్నది తపతి.

"చప్పుడు చెయ్యకుండా రావటం నాదే పొరపాటు. నీ కూతురి కంటి జబ్బు గురించి విని, దానికి మందు ఇవ్వటానికి వచ్చాను. ఇందులో లేపనం ఉన్నది. ఈ లేపనం కొంచెం కొంచెంగా తీసి నీ పిల్ల కళ్ళకు పూశావంటే ఆమె కళ్ళు ఎప్పటిలాగు అవుతాయి," అంటూ ఆ మనిషి తపతికి ఒక కొయ్య బరిణ ఇచ్చాడు.

తపతి ఆ బరిణ తీసుకుని మూత తీసి చూసింది. అందులో ఉన్న లేపనం ఆకు పసరు రంగులో ఉన్నది. వాసన చూస్తే ఏదో పూలవాసన కొట్టింది. ఆ మందు ఇచ్చినందుకు కృతజ్ఞత చెప్పుకుందామని తపతి తల ఎత్తి చూస్తే ఆ మనిషి లేడు.

ఏమవుతుందోనని సంకోచ పడుతూనే తపతి బరిణలోని లేపనం కొద్దిగా తీసి కూతురి కళ్ళకు పూసింది. కొంచెం సేపు గడిచాక ఆ పిల్ల, "నొప్పి తగ్గుతున్నట్టుగా ఉన్నదమ్మా!" అన్నది. మరి కొద్ది క్షణాలకు ఆ పిల్ల కళ్ళు చికిలించటం మాని, పూర్తిగా తెరిచి చూడసాగింది. తపతికి కలిగిన ఆనందం ఇంతా అంతా కాదు. తల్లి కూతుళ్ళు ఇల్లు చేరుకునే సరికి వాళ్ళు దారి వెంబడి నడిచినట్టే అనిపించలేదు.

మరి రెండు మూడు రోజుల పాటు ఆ లేపనం పూసేసరికి పిల్ల కళ్ళు ఎరుపూ, వాపూ పోయి, ఎప్పటి కళ్ళు అయాయి. తపతి ఆ బరిణెను భద్రంగా దాచింది.

కొంత కాలం గడిచింది. ఒకనాడు తపతికి తన కుడి కన్ను నొచ్చుతున్నట్టు తోచింది. తన కూతురికి వచ్చిన కంటి జబ్బే తనకు కూడా సోకిందేమో నని ఆమె భయపడింది.



కాని బరిణలో ఉన్న లేపనం వాడటానికి ఆమె సంకోచించింది. ఎందుకంటే ఆ మనిషి ఎవరో ఆ మందును ప్రత్యేకించి తన కూతురి కోసమే ఇచ్చాడు. దానిని తాను ఉపయోగించటం అపచారమేమోనని ఆమె భయపడింది.

"'నీ కూతురు తప్ప మరెవరూ దీనిని వాడకూడదు.' అని ఆ మనిషి అనలేదు గద? వాడి చూస్తాను. ఇంతలో కలిగే నష్టమేమిటి?" అనుకుని తపతి ఆ లేపనాన్ని తన కుడి కంటి మీద రుద్దుకున్నది. అందువల్ల లాభమే కలిగింది. బాధ వెంటనే ఉపశమించి, రెండు మూడు రోజులకల్లా కన్ను మామూలుగా అయిపోయింది.

కొన్ని మాసాలు గడిచాయి. ఒకనాడు తపతి సంతకు వెళ్ళింది. ఆమె దుకాణాలన్నీ చూస్తూ నడుస్తూండగా ఒక మలుపులో కొన్ని ధాన్యం బస్తాలు మూతులు విప్పి నేల మీద కనిపించాయి. ఆ బస్తాల తాలూకు మనుషులెవరూ లేరు. కాయరంగు ధోవతీ కట్టుకున్న మనిషి ఎవడో ఒక బస్తాలో నుంచి ధాన్యం తన చేతి సంచీలో పోసుకుంటూ ఉండటం తపతి చూసి నిర్ఘాంత పోయి, తనకు సమీపంలో ఉన్న ఆడమనిషితో, "ఆ మనిషి చూశావుటమ్మా, ఎంత పాడు పని చేస్తున్నాడో!" అంటూ చేత్తో చూపించింది.

ఆ ఆడమనిషి, "ఏ మనిషమ్మా?" అని అడిగింది.

"కాయరంగు బట్ట కట్టుకుని లేడూ? ఆ బస్తాల దగ్గిర!" అన్నది తపతి.

"బస్తాల దగ్గిర ఎవరూ లేరే! కాయరంగు బట్టల వాళ్ళు కనుచూపు మేరలో లేందే!" అన్నది ఆ ఆడమనిషి.

ఆమెతో లాభం లేదనుకుని, తపతి ఆ దొంగను సమీపించింది. దగ్గిరగా చూస్తే అతను తనకు ఆ నాడు బావి దగ్గిర లేపనం ఇచ్చినవాడే.

తపతి అతన్ని సమీపించి, "బాబూ, నువు ఇలాటి పని చెయ్యకూడదు. నీ దగ్గిర డబ్బులు లేకపోతే నేనిస్తాను పట్టు. ఒకసారి

నువు నాకు సహాయం చేశావు. ఇప్పుడు నేను నీకు సహాయం చేస్తాను," అన్నది.

అతను చప్పున తల ఎత్తి తపతిని చూసి, చిన్నగా, "ఏ కంటితో నువు నన్ను చూస్తున్నావు?" అని అడిగాడు.

తపతి ఒకటి తరవాత ఒకటిగా కళ్ళు మూసి తెరిచి, అమాయకంగా, "నా కుడి కంటికి కనిపిస్తున్నావు, నాయనా!" అన్నది.

వెంటనే ఆ మనిషి తపతి కుడి కంట్లోకి ఊది, మాయమయాడు. తపతి కుడి కన్ను మూసి తెరిచేసరికి ఆ కంటికి చూపు లేకుండా పోయింది.

అయినా తపతి జరిగిన దానికి పశ్చాత్తాప పడలేదు. ఆమె ఆ లేపనం గల బరిణను మళ్ళీ తెరిచిన పాపాన పోలేదు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, తపతి తనకు మేలు చేసిన వాణ్ణి ఎందుకు మందలించింది? తనకు మహోపకారం చేసిన వాడి తప్పు ఎందుకు క్షమించ లేక పోయింది? ప్రపంచ జ్ఞానం లేకనా? కృతజ్ఞత లేకనా? ఆమె అతనిచ్చిన లేపనాన్ని తిరిగి ఎందుకు వాడలేదు? ఈ ప్రశ్నలకు తెలిసి కూడా సమాధానం చెప్పక పోతే నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఆ లేపనం ఇచ్చిన వాడు తపతికి మాత్రమే సహాయం చేశాడు. ఆ సహాయం పొందిన మాత్రాన తపతి మంచి చెడ్డల విచక్షణ పోగొట్టుకోవటం స్వార్థమవుతుంది. తపతిలో అలాటి స్వార్థం లేదు. ఆమె ఏ పని చేసినా ఔచిత్యం గురించి ఆలోచించే మనిషి. అతని పట్ల కృతజ్ఞత ఉండ బట్టే ఆమె అతనికి డబ్బు ఇస్తానన్నది. తాను ధర్మం అనుకున్న పని చేసింది గనక ఆమె కన్ను పోయినా పశ్చాత్తాప పడలేదు. అవినీతిపరుడి నుంచి పొందే సహాయం కోరదగినది కాదు గనక తపతి ఆ బరిణను మళ్ళీ తెరవలేదు. తపతి ప్రవర్తనలో ఎలాంటి లోపమూ లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌన భంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# చచ్చినా మారదు!

ఒక గ్రామంలో ఒక చాకలివాడి భార్య పెడసరం మనిషి; మొగుడు వద్దన్న పని తప్పక చేసేది. ఒక రోజు భార్యా భర్తలు బట్టలు ఉతకటానికి నదికి వెళ్ళారు. మామూలుగా వాళ్ళు ఉతికే చోట ప్రవాహం ఉరవడిగా ఉండటం చేత చాకలి, "ఇవాళ ఇక్కడ ఉతక వద్దు. ప్రవాహం వేగంగా ఉన్నది. ఇంకో చోటికి పోదాం," అన్నాడు.

చాకలి భార్య మొండిగా నదిలోకి దిగి ప్రవాహంలో కొట్టుకుపోయి, చచ్చిపోయింది. తరవాత ఆమె దయ్యమై మరొక చాకలి పిల్లను పట్టింది. ఆ దయ్యాన్ని ఎలాంటి భూత వైద్యులూ వదిలించలేకపోయారు.

ఈ సంగతి చాకలికి తెలిసి, "దయ్యాన్ని నేను వదిలిస్తాను. ఒక్క క్షణంపాటు నన్ను దయ్యం పట్టిన పిల్లతో మాట్లాడనివ్వండి." అని పిల్ల తల్లిదండ్రులతో అన్నాడు. వాళ్ళు సరేనన్నారు.

చాకలి దయ్యం పట్టిన పిల్ల చెవిలో రహస్యంగా, "ఒసే, నువు చేరిన చోటు చాలా మంచిది. నీ కిక్కడ బాగా జరుగుతుంది. ఈ పిల్లను వదిలి ఇంకెక్కడికీ పోకు," అన్నాడు.

వెంటనే దయ్యం ఆ పిల్లను వదిలిపోయింది. ఆ పిల్లనే చాకలికి ఇచ్చి పెళ్ళి చేశారు.

—పి. వసంత





# బాతుల కన్నడు

ఒక గ్రామంలో ఒక పేదరాలికి కన్నడు అనే కొడుకు ఉండేవాడు. తల్లి వాడిచేత ఏ పనీ చేయించలేక పోయింది. ఎవరి దగ్గర నన్నా కమతగాడుగా పెడదామంటే, "నేను ఎవరి కిందా పని చెయ్యను," అని వాడు మొండికెత్తాడు.

పేదరాలికి రెండు ఆడ బాతులూ, ఒక మగ బాతూ, పదహారు పిల్ల బాతులూ ఉండేవి. ఒకనాడు వాడు తల్లితో పిల్ల బాతులను పట్నంలో అమ్ముకుని వస్తానని బయలు దేరాడు. పట్నంలో వ్యాపారస్థలం పెద్ద సంతలా గుంటుంది. కన్నడు బాతులను తోలుకుని అక్కడికి చేరేసరికి వీరస్వామి అనే ధనికుడు వాణ్ణి చూసి, "బాతులను ఎలా అమ్ముతావు?" అని అడిగాడు.

"జత రెండు వెండి వరహాలు. దేవుడు అడిగినా అంతకు తక్కువకు ఇచ్చేది లేదు." అన్నాడు కన్నడు.

ఈ వీరస్వామి నగరమంతా కొనగల ధనికుడు. ఆయన కన్నడితో, "దొంగవెధవా, నాతో బేరం ఆడగలవాడివా నువ్వు? జతకు రెండు సత్తు మాడలిస్తాను," అన్నాడు.

"వెండి వరహాలని చెప్పాను కానా?" అన్నాడు కన్నడు.

"ఈ వెధవను ఇంటికి పట్టుకురండి. బాతులను కూడా తోలుకురండి," అని వీరస్వామి తన వెనక ఉన్న ఇద్దరు నౌకర్లతో అన్నాడు. కన్నడిని వాళ్ళు వీరస్వామి ఇంటికి ఈడ్చుకు పోయి, యజమాని ఆజ్ఞ మీద చింత బరికెతో పాతిక దెబ్బలు కొట్టారు. బాతుల ధర వాడికి ఆ రూపంలో ముట్టింది.

దెబ్బలు తిన్న కన్నడు, "దీనికి మూడింతలు వసూలు చెయ్యక పోతే నా పేరు కన్నడు కాదు!" అన్నాడు.

వీరస్వామి మరింత మండిపడి కన్నణ్ణి మరో ముప్ఫై దెబ్బలు కొట్టించి పంపేశాడు.

---

బి. సరోజిని

---



తరవాత కన్నడు చాలా ఏళ్ళ పాటు ఊళ్ళ వెంట తిరిగి బతుకుతూ పెద్దవాడయాడు. కాని వీరస్వామి మీద వాడికున్న కసి ఏ మాత్రమూ తగ్గలేదు.

కొంత కాలానికి వాడు వీరస్వామి ఉండే పట్నానికి తిరిగి వచ్చి, వీరస్వామి కొత్తగా ఒక పెద్ద భవంతి కట్టిస్తున్నట్టు విన్నాడు. వెంటనే వాడు వడ్రంగి లాగా వేషం వేసుకుని, ఇల్లుకట్టే చోటికి వెళ్ళి, అక్కడ ఒక పక్కగా పేర్చి ఉన్న కలపను తణిఖీ చెయ్యసాగాడు.

వీరస్వామి వాణ్ణి చూసి దగ్గిరికి వచ్చి, "ఎవరు నువు? నీకు కలప నాణెం తెలుసునా ఏం?" అన్నాడు.

"నేను దూర దేశపు వడ్రంగినండి. అంతో ఇంతో పేరు తెచ్చుకున్నవాణ్ణే. కలప నాణెం తెలీకేం?" అన్నాడు కన్నడు.

"ఈ కడుతున్న ఇంటికి ఈ కలప తగి ఉంటుందా?" అని వీరస్వామి అడిగాడు.

"ఇల్లు తగినట్టు ఉండాలంటే ఈ కలప పనికిరాదు," అన్నాడు కన్నడు.

వీరస్వామి కొంచెం ఆలోచించి, "నా యిలాకాన కొంత అడవి ఉన్నది. అక్కడికి పోదాం రా. పనికివచ్చే చెట్లు చూపింతువుగాని," అన్నాడు.

ఇద్దరూ కలిసి చెట్లు కొట్టే వాళ్ళను వెంట బెట్టుకుని అడవికి వెళ్ళారు. కన్నడు కొట్టదగిన చెట్లను ఎంచి పని వారికి చూపుతూ, వీరస్వామిని అడవి లోపలికి తీసుకు పోయాడు. నిర్జనమైన ప్రాతంలో కన్నడు వీరస్వామికి ఒక చెట్టు చూపించి, "ఇది ఉత్తమోత్తమ మైన చెట్టు. దాని కైవారం కొలవండి, ఎంత ఉందో చూస్తాను," అన్నాడు.

వీరస్వామి తన రెండు చేతులతో చెట్టును చుట్టాడు. కన్నడు తన బొడ్డులో నుంచి ఉచ్చుతాడు తీసి, వీరస్వామి రెండు చేతులకూ కలిపి తగిలించి, బిగించాడు. తరవాత వాడు ఒక బెత్తం చెట్టు నుంచి విరిచి, తన కసి తీరినదాకా వీరస్వామిని బాది, వీరస్వామి జేబులో నుంచి డబ్బుల సంచీ తీసి,

తన బాతుల ధర తీసుకుని, "నేను వస్త్రం గిని కాను, కన్నణ్ణి, బాతుల కన్నణ్ణి. నాకు డబ్బులు ఎగవేసి, యాభై అయిదు దెబ్బ లిచ్చావు. దెబ్బల బాకీ తీరింది. బాతుల ధర వసూలు చేసుకోవటానికి మరి రెండు సార్లు వస్తాను," అని చెప్పి, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

వీరస్వామి మనుషులు తమ యజమాని కోసం చాలాసేపు వెతికి, చివరకు జాడ తెలుసుకుని, ఆయనను ఇంటికి చేర్చారు. వీరస్వామి దెబ్బల బాధతోనేగాక భయంతో కూడా మంచం పట్టాడు.



కొద్ది రోజులు గడిచాక వీరస్వామి మంచం పట్టినట్టు కన్నడికి తెలిసింది. వాడు వైద్యుడి లాగా వేషం వేసుకుని ఊరి సత్రానికి వచ్చి, వీరస్వామి జబ్బు గురించి మాట్లాడుకునే వారితో, "ఆ పెద్ద మనిషికి నేను క్షణంలో నయం చెయ్యగలుగుదునే!" అన్నాడు.

ఈ వార్త వీరస్వామికి అందింది. ఆయన కొత్త వైద్యుణ్ణి తన ఇంటికి పిలిపించాడు.

"నేను మళ్ళీ లేచి తిరుగుతా నంటారా, అచార్లుగారూ?" అని వీరస్వామి బాతుల కన్నణ్ణి అడిగాడు.

"ఎందుకు తిరగరండీ? రాంబాణం లాటి ఔషధం తయారు చేస్తాను," అని కన్నడు ఇంట్లో ఉన్న నౌకర్లలో ఒకణ్ణి ఒక దినుసు తెమ్మని పంపాడు. వాడు వెళ్ళాక ఇంకో దినుసు తెమ్మని ఇంకొకణ్ణి పంపాడు. ఇలా ఉన్న నౌకర్లందరినీ పంపేసినాక వాడు, మూలనున్న దుడ్డుకర్ర తీసి, "అసలు చికిత్స ఇదీ! నేను వైద్యుణ్ణి అనుకున్నావా? కాను. బాతుల కన్నణ్ణి. బాతుల ఖరీదు పుచ్చుకోవటానికి రెండోసారి వచ్చాను," అన్నాడు.

వీరస్వామి కేకలు కూడా పెట్టలేదు. భయంతో ఆయనకు నిలువు గుడ్లు పడి పోయాయి. కన్నడు కర్ర అవతల పారేసి, పెట్టెలన్నీ వెతికి, బాతుల డబ్బు పుచ్చుకుని, "ఇంకొక్కసారి వస్తాను," అంటూ వెళ్ళిపోయాడు.

తరవాత చాలా ఏళ్ళు గడిచాయి. వీర స్వామి మళ్ళీ లేచి తిరుగుతున్నాడు. ఆయన బాతుల కన్నణ్ణి పూర్తిగా మరిచి పోయాడు కూడా. కన్నడికి మాత్రం మరొక సారి వీరస్వామిని కలుసుకోవాలనిపించింది.

ఒక రోజు ఉదయం వాడు పట్నంలో వర్తక స్థానానికి చేరాడు. వీరస్వామి ఇంకా అటు కేసి రాలేదు. ఒక మనిషి గుర్రాన్ని అమ్మ జూపుతూ కన్నడికి కనిపించాడు. కన్నడు దాన్ని గురించి అడిగితే, "ఈ గుర్రాన్ని మించి పరిగెత్తగల గుర్రం ఈ దేశంలో లేదు," అన్నాడు ఆ మనిషి.

"నేను చెప్పినట్టు చేశావంటే నీ గుర్రాన్ని నేను కొంటాను," అన్నాడు కన్నడు.

"ఏం చెయ్యమన్నావో చెప్పు," అన్నాడు ఆ మనిషి.

"బండి మీద షావుకారు వీరస్వామి వస్తూంటాడు. నువు ఎదురు వెళ్ళి ఆయనతో, 'నేనే బాతుల కన్నణ్ణి!' అని గట్టిగా అను. అని వెంటనే వేగంగా వచ్చెయ్యి. లేకపోతే ప్రమాదం!" అన్నాడు.

గుర్రం అమ్మేవాడు తన గుర్రం మీద ఎదురు వెళ్ళి, జోడు గుర్రాల బండిలో వస్తూ వీరస్వామి కనిపించగానే, "నేనే బాతుల కన్నణ్ణి!" అని చెప్పి గుర్రాన్ని దౌడు తీయించాడు.

వీరస్వామి ఆవేశంగా బండిని ఆపించి, బండి గుర్రాలను విప్పించి, తన నౌకర్లతో, "వాణ్ణి పట్టుకున్న వాడికి రెండు బంగారు కాసు లిస్తాను. త్వరగా," అన్నాడు. వీర స్వామి నౌకర్లు బండి గుర్రాల నెక్కి బయలు దేరారు. వీరస్వామి బండిలో ఉండి పోయాడు.

అప్పుడు కన్నడు ఆయనను సమీపించి, "బాతుల కన్నడు ఆ మనిషి కాదు, నేను!" అన్నాడు.

వీరస్వామి భయంతో కొయ్యబారి పోయాడు. కన్నడు ఆయన జేబులో చెయ్యి పెట్టి డబ్బుల సంచీ తీసేసుకుని, "ఇక నీతో నా పని తీరిపోయింది," అని వెళ్ళి పోయాడు. తరవాత వీరస్వామి వాణ్ణి చూడలేదు.





# అబూ సీర్

## 4

మర్నాడు అబూ సీర్ నగరమంతటా చాటింపు వేయించి, నగరవాసులందరూ రాజుగారి స్నానశాలలో స్నానాలు చేయ వచ్చుననీ, మూడు రోజులపాటు స్నానాలు ఉచితమనీ తెలియబరిచాడు. స్నానశాల వద్ద జనం తండోపతండాలుగా ఎగబడ్డారు. మూడు రోజులపాటు అబూ సీర్ ఎవరి వద్దా డబ్బు వసూలు చెయ్యలేదు. నాలుగో రోజు నుంచీ అతను స్నానశాల ద్వారం వద్ద హుండీ పెట్టుకుని కూర్చుని, స్నానాలు చేసి వెళ్ళిపోయేవారు ఎంత ఇస్తే అంత వసూలు చేశాడు. సాయంకాల మయేసరికి హుండీ నిండి పోయింది. ఈ విధంగా అతను కాల క్రమాన గొప్ప ధనికుడయాడు.

స్నానశాల ప్రారంభించిన కొద్ది రోజులకే రాణీగారు, తన భర్త స్నాన సౌకర్యాలను తెగ మెచ్చుకోవటం చూసి తాను కూడా అక్కడికి వెళ్ళి స్నానం చేయ నిశ్చయించింది. ఈ వార్త అందగానే అబూ సీర్ స్నానశాలలో ఉదయం పూట పురుషులూ, సాయంకాలం పూట స్త్రీలూ స్నానాలు చేయటానికి ఏర్పాటు చేశాడు. స్త్రీలు ఇచ్చే డబ్బు వసూలు చెయ్యటానికి గాను అతను నగరంలోని ఒక మర్యాదస్తురాలైన స్త్రీని ఏర్పాటు చేశాడు.

రాణీగారు ఒకసారి స్నానం చేసి అందులోని సుఖం అనుభవించిన మీదట, ప్రతి శుక్రవారం సాయంకాలమూ వచ్చి అక్కడ స్నానం చేయ నిర్ణయించింది. రాజుగారు ప్రతి శుక్రవారం ఉదయమూ వచ్చి వెయ్యి దీనారాలు ఇచ్చినట్టే, రాణీగారు కూడా ప్రతి శుక్రవారం సాయంకాలమూ వచ్చి స్నానం చేసి వెయ్యిదీనారాలు ఇస్తూ వచ్చింది.



అబూ సీర్ సంపదా, గౌరవమూ, కీర్తీ అపారంగా పెరిగి పోతున్నాయి. కాని అతను పూర్వంలాగే వినయ విశ్వాసాలు కలిగి ఉన్నాడు. అతని మనసు ఏమీ మారలేదు; ఎప్పుడూ ఆనందంగా ఉండేవాడు. అతని సౌజన్యమూ, పేదలంటే దయా అలాగే ఉన్నాయి. బీదవాళ్ళ దగ్గిర ఎన్నడూ డబ్బు పుచ్చుకోడు. అతని మంచితనమే చివరకు అతన్ని కాపాడింది. అది ఎలా జరిగినదీ ముందు ముందు తెలుస్తుంది.

అబూ సీర్ నడుపుతున్న స్నానశాలను గురించి కలంకారీవాడు అబూ కీర్ కూడా విన్నాడు. ఎందుకంటే, దాన్ని భూలోక స్వర్గంగా నగరవాసులందరూ చెప్పుకుంటు న్నారు. తాను కూడా స్నాన సౌఖ్యం అనుభ వించాలనుకుని అబూ కీర్ మేలి దుస్తులు ధరించి, తన కంచరగాడిద మీద ఎక్కి, సపరివారంగా స్నానశాలకు బయలుదేరాడు. అతనికి ముందూ, వెనకా కూడా బానిసలు బెత్తాలు పట్టుకుని నడిచారు.

స్నానశాలలోకి అడుగు పెట్టగానే అగరు చందనం వాసనలు గుప్పున తగిలాయి. అంతులేని జనం లోపలికి పోతున్నారు, బయటికి వస్తున్నారు. అతని పాత స్నేహి తుడు హుండీ దగ్గిర చిరునవ్వులు చిందిస్తూ కూర్చుని కనిపించాడు. అబూసీర్ ఇప్పుడు బాగా ఒళ్ళు చేసి ఉండటం చేత అతన్ని అబూ కీర్ చప్పున గుర్తించలేక పోయాడు. గుర్తించగానే అతనికి కలిగినది ఈర్ష్యే. అయినా అబూ కీర్ పరమానందం నటిస్తూ అబూ సీర్‌ను సమీపించి, "ఎంత పని చేశావు! స్నేహితుడూ, బుద్ధిమంతుడూ అయినవాడు చేసే పనేనా? నే నీ నగరంలో ఆస్థాన కలంకారీవాణ్ణిగా ఉంటున్న సంగతి ఎరగవా? నన్ను చూడటానికి ఎందుకు రాలేదు? నీ పాత స్నేహితుడు ఏమైనాడని విచారించనైనా విచారించావా? నేను నీకోసం మనుషులను పంపి ఊరంతా ఎలా గాలిం చాను! నీ జాడే దొరకలేదు," అన్నాడు.

అబూ సీర్ విచారంగా తల ఆడించి, "అబూ కీర్, నేను నీ దుకాణానికి వస్తే,

నన్ను చావగొట్టి, అవమానించి, 'దొంగ, దొంగ!' అని అరిచినదంతా మరిచావా?" అని అడిగాడు.

అబూ కీర్ ఆశ్చర్యం అభినయిస్తూ, "ఏమిటి నువ్వనేది? నేను కొట్టినది నిన్నా? ఎంత ఒట్టుపడితే అంత ఒట్టు! నేను నిన్ను గుర్తించలేదు. ఒక దొంగ వెధవ నా దగ్గిర బట్టలు ఎత్తుకుపోతూ వచ్చాడు. నిన్ను చూసి వాడే అనుకున్నాను. నువు గుర్తుపట్ట రాకుండా పాలిపోయావు. అంతా అల్లా మహిమ! అయినా కొంత తప్పు నీదే. నన్ను చూడగానే నీ పేరు చెప్పి ఉండకూడదూ? పైగా ఆ రోజు చాలా చిరాకులో ఉన్నాను. ఈ తప్పు క్షమించక తప్పదు," అన్నాడు.

"జరిగిన దేదో జరిగింది. లోపలికి వచ్చి, బట్టలు విప్పి, స్నానం చెయ్యి," అన్నాడు అబూ సీర్ అబూ కీర్‌తో.

"అయితే, అన్నా, నీకి దశ ఎలా ఎత్తుకున్నది?" అని అబూ కీర్ అడిగాడు.

"నిన్ను పైకి తెచ్చినవాడే నన్నూ పైకి తెచ్చాడు," అంటూ అబూ సీర్ తన కథ అంతా చెప్పాడు.

అబూ కీర్ అంతా విని, "రాజుగారికి నీ మీద అనుగ్రహం కలగటం ఎంత మంచిది! నా స్నేహితుడివని చెప్పానంటే రాజుగారికి నీ మీద ఉండే అభిమానం రెట్టింపు అవుతుంది," అన్నాడు.



"మనం చేసేది ఏముందిలే, నిగ్రహమూ, అనుగ్రహమూ అల్లా చేతిలో ఉన్నాయి. నువు బట్టలు తీసి స్నానం చెయ్యి," అన్నాడు అబూ సీర్. అతను తానే స్వయంగా అబూ కీర్‌కు ఒళ్ళు పట్టి స్నానం చేయించాడు; తరవాత అతనికి తాగటానికి షర్బతులు తానే ఇచ్చాడు. అబూ సీర్ అలా రాజుగారికి తప్ప మరెవ్వరికీ చెయ్యడు. అందుచేత స్నానాలు చేసే ఇతరులు కలంకారీవాడికి జరిగే మర్యాద చూసి విస్తుపోయారు.

వెళ్ళిపోతూ అబూ కీర్ డబ్బు ఇవ్వబోయాడు. కాని అబూ సీర్ నిరాకరించి, "ఇది చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది!



నాకు డబ్బు ఏమని ఇస్తున్నావు? స్నేహితుల మధ్య ఈ భేదమేమిటి?'' అన్నాడు.

''సరే, నీ యిష్టం. నువు నాకు ఆదరం చూపినందుకు నేను నీ కొక సలహా ఇస్తాను. నీ స్నానశాల అన్నివిధాలా దివ్యంగా ఉన్నది గాని ఇక్కడ వెంట్రుకలు రాలిపోయే నలుగు పిండి ఒకటి లేకపోవటం పెద్ద లోపంగా ఉన్నది. అది ఎలా తయారు చేయాలంటే, ఉల్లి పాషాణమూ, సున్నమూ కలిపి నూరి, నూనెతో సుద్ద చేయాలి. అది దుర్వాసన కొట్టకుండా అందులో కస్తూరి కలపాలి. అలాటి నలుగు పెట్టావంటే రాజుగారు మితిలేని ఆనందం పొందుతాడు. ఆ నలుగుతో నలిచిన తరవాత చర్మం స్వచ్ఛంగానూ, నున్నగానూ ప్రకాశిస్తుంది.'' అన్నాడు అబూ కీర్.

అబూ సీర్ ఆ వివరాలన్నీ రాసుకుని అబూ కీర్‌ను పంపేశాడు.

అబూ కీర్ తిన్నగా రాజుగారి వద్దకు వెళ్ళి, ''మహారాజా, తమకు ఒక ముఖ్యమైన హెచ్చరిక చెయ్యటానికి వచ్చాను.'' అని అదుర్దాగా అన్నాడు.

''ఏమిటా హెచ్చరిక?'' అని రాజుగారు అతన్ని అడిగాడు.

''అల్లా కటాక్షం ఉండబట్టే భయంకర శత్రువు ఒకడు మీకు ఇంతవరకూ ఏ కీడూ చెయ్యలేకపోయాడు. ఆ అబూ సీర్ మీ ప్రాణానికీ, రాజ్యానికీ కూడా ఎసరు పెట్టబోతున్నాడు,'' అన్నాడు అబూ కీర్.

''ఏం చేస్తున్నాడేమిటి?'' అని, రాజు అడిగాడు.

''మహారాజా, ఈసారి తమరు స్నానశాలకు వెళ్ళటం జరిగితే అందులో నుంచి ప్రాణాలతో బయటపడటం అనుమానమే,'' అన్నాడు అబూ కీర్.

''ఎందుచేత?'' అని రాజు అడిగాడు.

అబూ కీర్ కంపరం అభినయిస్తూ, ''విషం! ఉల్లి పాషాణమూ, సున్నమూ కలిపి నూరి, అబూ సీర్ దానితో మీకు నలుగు పెట్టబోతున్నాడు. ఆ నలుగుతో ఒంటి మీది వెంట్రుకలు రాలిపోతాయనీ,

చర్మం నునుపెక్కి నిగనిగలాడుతుందని వాడు మీతో అంటాడు. కాని ఆ పిండి శరీరానికి తగలగానే భగ్గున మంట పుట్టుకొస్తుంది. అంతకన్న బాధాకరమైన చావు మరి ఉండదు. వాడు శత్రురాజుల చారుడు. తమ ప్రాణాలు తీయటానికే వాణ్ణి పంపారు. మీ ఉప్పు చాలా తిని ఉన్నాను గనక, ఈ మాట తెలియగానే తమరిని హెచ్చరించటానికి పరిగెత్తుకుంటూ వచ్చాను," అన్నాడు.

అబూ కీర్ చెప్పిన అబద్ధాలలో రాజుకు గురి కుదరటమే గాక, దడ కూడా పుట్టుకొచ్చింది. ఆయన అబూ కీర్‌తో, "ఈ సంగతి రహస్యంగా ఉంచు. నే నిప్పుడే మంత్రిగారితో సహా స్నానశాలకు వెళ్ళి, నువు చెప్పినది నిజమో, కాదో తెలుసుకుంటాను," అన్నాడు.

రాజూ, మంత్రీ స్నానశాలకు రాగానే అబూ సీర్ రాజుగారి చేత ముందు స్నానం చేయించటానికి ఉపక్రమించాడు. కాని రాజుగారు ముందుగా మంత్రికి స్నానం చేయించమన్నాడు.

మంత్రి స్నానం ముగిసినాక అబూ సీర్ రాజుతో, "మహారాజా, ఒక కొత్తరకం నలుగు తయారు చేశాను. అది వెంట్రుకలను సులువుగా రాల్చేస్తుంది. కత్తితో క్షౌరం చెయ్యవలిసిన పని ఉండదు.




ఈ నలుగు తమ కోసం ప్రత్యేకంగా తయారు చేశాను," అన్నాడు.

"ఏదీ, దాన్ని మంత్రి మీద ఉపయోగించు," అన్నాడు రాజు.

అబూ సీర్ తాను తయారు చేసిన పిండిని మంత్రి కాలి మీద కొద్దిగా పూశాడు. అది పూసినంత మేర వెంట్రుకలు తుప్పురాలినట్టు రాలిపోయాయి.

ఇది చూడగానే రాజుకు ఆ నలుగు గొప్ప విధ్వంసన శక్తి గల మహా విషమని నమ్మకం కలిగింది. ఆయన తన భటులతో, "ఈ హంతకుణ్ణి పట్టుకోండి," అన్నాడు.

రాజూ, మంత్రీ, భటుల వెంట అబూ సీర్ రాజభవనానికి వచ్చారు. తనను భటులు

ఎందుకు పట్టుకున్నదీ అబూ సీర్‌కు అర్థం కాలేదు.

రాజు రేవు అధికారిని పిలిపించి, అతనితో, "ఈ రాజద్రోహిని తీసుకుపోయి, కాల్చిన సున్నపు రాళ్ళతో సహా గోతంలో పెట్టి కట్టి, నా కిటికీ నుంచి కనిపించేలాగా సముద్రంలో పడెయ్యి. అలా చేస్తే వీడికి నిప్పుతోనూ, నీటితోనూ చావు వస్తుంది." అని ఆజ్ఞాపించాడు.

"చిత్తం, మహారాజా!" అని రేవు అధికారి అబూ సీర్‌ను చిన్న పడవలో ఎక్కించుకుని సముద్రం మీద బయలు దేరాడు.

ఈ రేవు అధికారి కొంత కాలం క్రితం ఒడ్డు సరంగుగా ఉంటూ, స్నానశాలకు రాగా, అతని వద్ద డబ్బు లేదని తెలిసి, ఉచితంగా అతనికి అబూ సీర్ చక్కని స్నానం చేయించి పంపేశాడు. ఆ కృతజ్ఞత మనసులో పెట్టుకుని రేవు అధికారి అబూ సీర్‌ను తన పడవలో ఒక చిన్న లంక మీదికి తీసుకుపోయి, "బాబూ, నేను నీ ఆదరాన్ని మరవలేదు. నేను నీకు ప్రత్యుపకారం చేస్తాను. రాజుగారికి ఏ విధమైన ద్రోహం చేసి ఇలాటి భయంకరమైన మరణ దండనకు గురి అయావు? నాతో నిజం చెప్పు," అన్నాడు.

"అన్నా, దేవుడు సాక్షిగా నేను ఏ విధమైన నేరమూ చేయ లేదు. నాకీ శిక్ష ఎందుకు విధించారో తెలియదు," అన్నాడు అబూ సీర్.

"అలా అయితే నీ విరోధులెవరో నీ మీద రాజుగారికి అబద్ధాలు చెప్పి ఉంటారు.



బాగుపడుతున్న వాడికి విరోధులకేం కొదవ? కాని ఈ లంక మీద ఉండిపో. నీకు ఎలాటి అపాయమూ కలగదు. చేపలు పట్టుతూ కూర్చున్నావంటే నీకు కాలక్షేపం అవుతుంది. ఈ లోపుగా నిన్ను మీ దేశానికి పంపే మార్గం ఏదో ఒకటి చూస్తాను." అన్నాడు రేవు అధికారి.

అతను ఒక సంచీలో కాల్చిన సున్నపు రాళ్ళు నింపుకుని పడవలో సముద్రం మీద వెళ్ళి, రాజ భవనపు కిటికీలకు ఎదురుగా పడవను ఆపి, రాజుగారు చెయ్యి ఊపి సంజ్ఞ చెయ్యగానే గోతాన్ని సముద్రంలోకి తోసేశాడు.

అయితే రాజుగారు చెయ్యి ఊపేటప్పుడు రాజుగారి వేలికి ఉన్న ఉంగరం జారి నీటిలో పడిపోయింది. అది అద్భుత శక్తులు గల ఉంగరమనీ, దాని మహిమ వల్ల, రాజు గారిని ఎదిరించిన వాళ్ళు భస్మమైపోతారనీ ఆ దేశంలోని ప్రజల నమ్మకం. అది పోయిం దని తెలిస్తే ప్రజలకు రాజుగారి మీద ఉన్న గురి కాస్తా పోతుంది. అందుచేత రాజు తన ఉంగరం సముద్రంలో పడిపోయిన సంగతి మరొక ప్రాణికి తెలియనివ్వక అతి రహస్యంగా ఉంచాడు.

లంక మీద ఒంటరిగా దిగబడిపోయిన అబూ సీర్, రేవు అధికారి ఇచ్చిన వల తీసు కుని చేపలు పట్టటానికి బయలుదేరాడు. అతనికి అందువల్ల పొట్ట గడవటమే గాక, బాధ కలిగించే ఆలోచనలు రాకుండా చూసుకోవచ్చు.






అబూ సీర్ వల వెయ్యగానే అందులో పెద్ద, చిన్న చేపలు, రంగు రంగువి చాలా పడ్డాయి. చేపల కూర తిని చాలా కాల మయిందని అబూ సీర్‌కు గుర్తు వచ్చింది. ఆ చేపలను రేవు అధికారి కిచ్చి వండించి, తాను కూడా చేప కూర తిందామనుకున్నాడు అబూ సీర్.

ఏమంటే, రోజూ సముద్రంలో చేపలు పట్టి, ఇద్దరు వంటవాళ్ళ చేత వాటిని వండించి, రాజుగారికి పంపే పని రేవు అధి కారిదే. ఈరోజు పని పడబట్టి గాని, లేక పోతే ఆ వలతో రేవు అధికారే చేపలు పట్టి ఉండేవాడు. ఈరోజు అబూ సీర్ వల వేసింది రేవు అధికారి తరఫునే.

వలలో పడిన చేపలలో పెద్దదాన్ని ఏరి, దాన్ని తన కోసం వండించుకుందామను కుని, అబూ సీర్ తన చాకు పైకి తీసి ఆ చేపను కోశాడు. అతను చాకు పైకి తీసే సరికి దాని మొనకు చిక్కుకుని ఒక బంగా రపు ఉంగరం కనిపించింది. అది రాజు గారు పోగొట్టుకున్న ఉంగరమే. ఆ సంగతి తెలియక అబూ సీర్ పరధ్యానంగా తన వేలికి పెట్టుకున్నాడు.

కొంతసేపు అయాక రేవు అధికారి తిరిగి వచ్చి, అబూ సీర్ చేతిన ఉన్న ఉంగరం చూసి నిర్ఘాంతపోయి, అది అబూ సీర్‌కు ఎలా దొరికినదీ విన్నాక, "ఎవరి విధి ఎలా ఉన్నదీ చెప్పలేం గద! నువు ఆ ఉంగరంతో రాజుగారి ఎదట పడవచ్చు. నిన్ను ఎవరూ అడ్డలేరు. రాజుగారు కూడా నీ ముందు పిల్లి అయిపోతాడు!" అన్నాడు.

అబూ సీర్ రాజభవనానికి వెళ్ళాడు. రాజుగారు దర్బారులో ఉన్నాడు. ఆయన అబూ సీర్‌ను చూసి, "నా యెదట సము ద్రంలో చచ్చిపోతివే, ఎలా బతికి వచ్చావు?" అని అడిగాడు.

అబూ సీర్ తనకు మరణదండన జరగ కుండా రేవు అధికారి ఎలా కాపాడినదీ, తనకు ఉంగరం ఎలా దొరికినదీ రాజుగారితో చెప్పి, "తమరు నాకు చూపిన అనుగ్రహం అంతులేనిది. అందుచేత తమకు

ఈ ఉంగరం ఇవ్వటానికి వచ్చాను. నేను నేరస్థుణ్ణి కాను; అయితే తిరిగి మీ ఎదటికి రాను. నా మీద ఏ నేరం ఆరోపించి నాకు దారుణమైన మరణ దండన విధించారో తెలపమని కోరుతున్నాను," అన్నాడు.

రాజు ఉంగరం తీసుకుని తన వేలికి పెట్టుకోగానే ఆయనకు ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఆయన అబూ సీర్‌ను ఆలింగనం చేసుకుని, "నా క్రూరత్వాన్ని మరిచిపో. మరొకడైతే నా ఉంగరాన్ని నాకు తిరిగి ఇచ్చి ఉండడు. నీ మీద అబూ కీర్ అనే కలంకారీ వాడు లేని నేరం మోపాడని నాకిప్పుడు అనుమానంగా ఉన్నది. నువు నా శత్రువుల పక్షాన రోమహరిణితో నన్ను చంపబోతున్నట్టు అతను నాతో చెప్పాడు," అన్నాడు.

అబూ సీర్ కళ్ళలో నీరు తిరిగింది. అతను రాజుతో అబూ కీర్ మొదటి నుంచీ తనకు చేసిన ద్రోహాలన్నీ చెప్పి, "రోమహరిణి అనేది తింటే ప్రాణాపాయం గాని దాన్ని పై పూతగా మా దేశంలో, ప్రతి ఒక్కరూ వాడతారు," అన్నాడు.

రాజు అబూ సీర్ మాటలు విశ్వసించాడు, కాని అబూ సీర్ కోరిన మీదట సత్రం దర్వానునూ, అబూ కీర్ దగ్గిర పనిచేసే వాళ్ళనూ పిలిపించి, అబూ సీర్ చెప్పినదంతా నిజమని రుజువు చేసుకున్నాడు.



తరవాత ఆయన తన భటులతో, "మీరు వెంటనే వెళ్ళి కలంకారీ అబూ కీర్‌ను వున్నవాణ్ణి వున్నట్టు పెడరెక్కలు విరిచి కట్టి తీసుకురండి," అన్నాడు.

భటులు వెళ్ళి, అబూ కీర్‌ను పట్టుకుని, అతన్ని తన్ని కింద పడేసి, పెడరెక్కలు విరిచి కట్టి, రాజ సభకు ఈడ్చుకు వచ్చారు. ఈ పాటికి చచ్చిపోయి ఉండవలసిన అబూ సీర్ దర్బారులో రాజు పక్కనే కూర్చుని ఉండటం కనిపించేసరికి, అబూ కీర్‌కు దడ పుట్టుకొచ్చి, తన ఆట కట్టినట్టు అర్థమయింది.

రాజు అతనితో, "ఇతను నీ మిత్రుడు. ఇతన్ని దోచావు, అవమానించావు, తిట్టావు,

కొట్టావు, వంచించావు. చివరకు చంపించ టానికి ప్రయత్నించావు. భగవంతుడి అను గ్రహం చేత అతను చావలేదు. ఇదంతా కాదనగలవా?'' అన్నాడు.

''కాదనలేడు! ఎలా కాదంటాడు?'' అని సాక్షులు గట్టిగా అరిచారు.

రాజు తన భటులతో, ''ఈ దుర్మార్గుణ్ణి కాళ్ళు పట్టుకుని ఈడ్చుకుంటూ నగర మంతా తిప్పి, సున్నపు రాళ్ళ గోతంలో పెట్టి కట్టి, సముద్రంలో పారెయ్యండి,'' అన్నాడు.

అబూ సీర్ ఆవేదనపడుతూ, ''మహా రాజా, నా మనవి విని ఇతన్ని శిక్షించకండి. ఎన్ని ద్రోహాలు చేసినా నేను ఇతన్ని క్షమించ గలను!'' అన్నాడు.

''నువు క్షమించినా, నేను క్షమించను. భటులారా, వీణ్ణి తీసుకుపొండి,'' అన్నాడు రాజు కోపంగా.

రాజభటులు అబూ కీర్ చేసిన ద్రోహ లను ప్రజలకు చెబుతూ, నగరమంతా ఈడ్చుకుంటూ పోయి, సున్నపు రాళ్ళ గోతంలో అతన్ని కట్టి, సముద్రంలో వేశారు. సున్నపురాళ్ళు ఉడుకుతూ, నీటిలో మునగ టానా అబూ కీర్ చచ్చాడు.

రాజు అబూ సీర్‌తో అతనికి ఏం కావా లన్నా ఇస్తానన్నాడు.

''మహారాజా, నాకు ఇంటికి పోవాలని తప్ప మరే కోరికా లేదు,'' అన్నాడు అబూ సీర్.

''నిన్ను నా మంత్రిగా ఉంచుకుంటాను, ఉండవా?'' అన్నాడు రాజు.

అబూ సీర్ ఉండనన్న మీదట రాజు అబూ సీర్ కోసం ఒక పెద్ద ఓడ సిద్ధం చేయించి, దాని నిండా ధనరాసులూ, ఆడ, మగ బానిసలూ నింపి, అతన్ని అలెగ్జాంద్రి యాకు పంపేశాడు.

అబూ సీర్ అలెగ్జాంద్రియా రేవులో దిగే సమయానికి అక్కడికి ఒక గోతం కొట్టుకు వచ్చింది. అందులో అబూ కీర్ శవం ఉన్నది! అబూ సీర్ ఆ శవాన్ని సముద్ర తీరానే సమాధి చేయించాడు.

—(అయిపోయింది)






# అధర్మసత్రం

ఒకసారి రంగాపురంలోని పెద్దలంతా సమావేశమై, ప్రయాణీకుల సౌకర్యార్థం రహదారి మీద ఒక ధర్మసత్రం కట్టించి, వంట చెయ్యటానికి ఒక ముసలిదాన్నీ, లెక్కలు చూడటానికి ఒక గుమాస్తానూ, ఇతర పనులు చెయ్యటానికి ఒక నౌకరునూ పెట్టి, సత్రం నిర్వహణకు అయే ఖర్చు దేవుడి మాన్యం నుంచి వచ్చేటట్టు ఏర్పాటు చేశారు.

కొంతకాలం పాటు సత్రం నిర్వహణ సక్రమంగానే జరిగింది. ఊరికి పెడగా ఉన్న ఆ సత్రానికి యాత్రికులూ, ప్రయాణీకులూ తప్ప ఊళ్ళో వాళ్ళు ఎవరూ వచ్చేవారు కారు. మామూలు ప్రయాణీకులు సత్రంలో భోజనం చేసి, పడుకుని నిద్రపోయి, మర్నాడు తమ ప్రయాణం సాగించేవారు. కాస్త డబ్బున్న వాళ్ళు సత్రం సిబ్బంది ముగ్గురికీ తమకు తోచినంత ముట్టజెప్పి మరీ వెళ్ళేవారు.

ఇలా డబ్బు తీసుకోవటం మరిగిన సత్రం వాళ్ళు ముగ్గురూ అందరి దగ్గిరా డబ్బు వసూలు చేయ నారంభించారు. డబ్బు లివ్వని వాళ్ళను సత్రంలోకి అడుగు పెట్టనిచ్చేవారు కారు. ప్రయాణీకులు రాగానే నౌకరు తన మామూలు వసూలు చేసేవాడు. డబ్బు లిస్తేగాని వంటలక్క విస్తరి వేసేది కాదు. మళ్ళీ డబ్బు చెల్లిస్తే గాని గుమాస్తా పడుకునేటందుకు చోటు చూపించేవాడు కాడు. ధర్మసత్రం కాస్తా పూటకూళ్ల ఇల్లుగా మారిపోయింది. అయితే ఈ సంగతి ఊళ్ళో తెలియకుండా సత్రం మనుషులు ముగ్గురూ చాలా జాగ్రత్త పడ్డారు.

ఇలా ఉండగా ఒకసారి ఒక యువకుడు అర్యాపురం పోతూ చీకటిపడి రంగాపురపు సత్రం చేరి అక్కడ బస చేద్దామనుకున్నాడు. కాని అతని వద్ద డబ్బు లేక పోవటం చేత సత్రం మనుషులు అతన్ని

పొతుకూచి దుర్గాలక్ష్మి



సత్రంలోకి రానివ్వలేదు. అతను ఆ రాత్రి తిండిలేక, సత్రం వెలపల ఏ చెట్టు కిందనో నిద్రపోయి, మర్నాడు ఆర్యాపురం చేరుకుని, తనకు జరిగిన అనుభవం తన మిత్రులకు చెప్పాడు.

ఈ సంగతి విన్నవారిలో రామయ్యా అనే వాడు ఆ సత్రం మనుషులకు బుద్ధి చెప్పాలని నిశ్చయించుకుని, ఒక నౌకరును వెంట బెట్టుకుని రాత్రి భోజనాల వేళకు రంగాపురం సత్రం ప్రాంతాలకు చేరాడు. అతను తన నౌకరుతో, "ఒరే, నువు ఊళ్ళోకి వెళ్ళి, ఊరి పెద్దలతో రంగాపురం రాజావారి బావమరిది సత్రంలో దిగినట్టు చెప్పిరా," అని చెప్పి పంపేసి, తాను సత్రానికి వచ్చాడు.

వెంటనే సత్రం నౌకరు రామయ్యాను సమీపించి, "డబ్బు లివ్వండి, స్నానానికి నీళ్ళు తోడుతాను," అన్నాడు.

రామయ్యా చెవిటి వాడి లాగా నటిస్తూ, "అవును, నేను ఒక్కణ్ణే వచ్చాను," అని సత్రంలోకి ప్రవేశించాడు.

భోజనాల సావడిలో వంటలక్క విస్తళ్లు వేసి వడ్డన చేస్తున్నది. ఆమె రామయ్యాను చూసి, "డబ్బు లివ్వండి, మీకు కూడా విస్తరి వేస్తాను," అన్నది.

"పథ్యం ఏమీ లేదు. అన్నీ తింటాను," అంటూ రామయ్యా చప్పున వెళ్ళి, ఒక వడ్డించిన విస్తరి ముందు కూర్చున్నాడు.

"లేవవయ్యా! ఆ విస్తరి నీది కాదు!" అని వంటలక్క అరిచింది. రామయ్యా విననట్టు నటించాడు.

"కూర్చోనియ్యవమ్మా, ఆయనకు వినపడదు. ఇంకో విస్తరి ఆ చివరగా వెయ్యి," అని భోజనాలు చెయ్యబోతున్న వాళ్ళు చెప్పారు. విస్తరి ముందు నుంచి మనిషిని లేపటం మహాపాపమని వాళ్ళు అన్న మీదట వంటలక్క అసహాయురాలయింది.

రామయ్యా సుష్టుగా భోజనం చేసి, గుమాస్తా కనిపించగానే, "నాకు పక్క ఎక్కడ ఏర్పాటు చేశారు?" అని అడిగాడు.

"డబ్బు లిచ్చుకోవాలి!" అని గుమాస్తా గట్టిగా అరిచాడు.

"ఉంటే బూరుగు దూది పరుపే వెయ్యండి!" అన్నాడు రామయ్య.

గుమాస్తా అవతలికి వెళ్ళి నౌకరుతో, "ఒరే, ఆ చెవిటివాణ్ణి బయటికి గెంటెయ్యి! ఈ సత్రం తన బాబుగారి ఆస్తి అనుకుంటున్నట్టున్నాడు!" అన్నాడు.

నౌకరూ, గుమాస్తా తిరిగి వచ్చేసరికి రామయ్య మరెవరికో వేసిన పక్క మీద పడుకుని, నిద్ర పోతున్నట్టు చిన్న గురక కూడా పెట్టసాగాడు.

నౌకరు వచ్చి రామయ్యను కుదిలించి లేపాడు. రామయ్య కళ్ళు తెరిచి, "ఏమిటి కథ?" అన్నాడు.

"ఫో ముందు బయటికి!" అన్నాడు గుమాస్తా గట్టిగా.

"ఈ పక్క నాకు చాలా సుఖంగా ఉన్నది. దీని మీదే నిద్ర పోతాను," అన్నాడు రామయ్య.

"బయటికి ఈడ్చెయ్యక చూస్తావేంరా?" అని గుమాస్తా అరుస్తున్నాడు. నౌకరు రామయ్యతో పెనగులాడుతున్నాడు.

ఇంతలో గ్రామ పెద్దలు నలుగురూ హడావిడిగా సత్రంలోకి వచ్చి, "రాజావారి బావమరిదిగారు వచ్చారటగా? ఎక్కడ?" అన్నారు.

రామయ్య వారితో, "అయ్యా, రాజాగారి బావమరిది మాట ఏమో గాని, డబ్బు లివ్వలేదని రాత్రి ఈవేళప్పుడు నన్ను బయటికి గెంటేస్తున్నారు," అని గ్రామ పెద్దలకు జరిగినదంతా చెప్పేశాడు.

గ్రామ పెద్దలు నిర్ఘాంతపోయి, మిగిలిన ప్రయాణీకులను అడిగితే, తామంతా నౌకరుకూ, వంటావిడకూ, గుమాస్తాకూ డబ్బులు ఇచ్చుకున్నట్టు చెప్పారు.

పంచాయతీ జరిగింది. సత్రంలో పంది కొక్కులల్లే చేరి ముగ్గురూ చాలా డబ్బు పోగు చేసినట్టు రుజువయింది. గ్రామ పెద్దలు వాళ్ళకు జరిమానా విధించి, పనిలో నుంచి తొలగించి, కొత్త వాళ్ళను నియమించి, అప్పుడప్పుడూ తాము వంతుల ప్రకారం వచ్చి సత్రం నిర్వహణను తణిఖీ చేసేటట్టు నిశ్చయించారు.



# బుద్ధిలేని దొంగలు

ఒక బ్రాహ్మణుడు ఒక ఊరి నుంచి మరొక ఊరికి ప్రయాణం చేస్తూండగా మధ్య దారిలో చీకటి పడింది. బ్రాహ్మడి వెంట తోడు ఎవరూ లేరు సరేగదా, అతను ప్రయాణించే దారి కూడా నిర్మానుష్యంగా ఉన్నది. అందుచేత బ్రాహ్మణుడు భయపడుతూ ముందుకు సాగాడు.

అయన భయపడుతున్నట్టే ఒక చోట అయనను నలుగురు దొంగలు అటకాయించి, దగ్గిర ఉన్నదంతా బయట పెట్టమన్నారు.

బ్రాహ్మణుడి దగ్గిర రెండు బంగారు నగలూ, కొద్దిగా పైకమూ ఉన్నది. దాన్ని ఇవ్వకపోతే దొంగలు తన ప్రాణాలు తీయటానికి కూడా సిద్ధంగా ఉన్నట్టు కనబడ్డారు.

బ్రాహ్మణుడు తన మూట విప్పి నగలూ, డబ్బూ చూపుతూ, "దొంగ సొమ్ము దొంగల పాలే అవుతున్నది! తీసుకోండి," అన్నాడు.

"ఇది దొంగసొమ్మా?" అని దొంగలు ఆశ్చర్యంగా అడిగారు.

"కాదా మరి? రెండు మైళ్ళ ఎగువన కొందరు దొంగలు పెళ్ళి బళ్ళను దోస్తూ, ఆ మాట ఎవరికీ చెప్పవద్దని ఈ నగలూ, రొక్కమూ చేతిలో పెట్టారు," అన్నాడు బ్రాహ్మణుడు.

ఆ మాట వింటూనే దొంగలు బ్రాహ్మణుడి సొమ్ము తీసుకునే ఆలోచన మానేసి, అయన వచ్చిన దిక్కుగా పరిగెత్తి పోయారు. బ్రాహ్మణుడు ముందుకుసాగి త్వరలోనే తన ఊరు చేరుకున్నాడు.

—కాళ్ళ గోవిందరావు





# బ్రాహ్మణుడి యుక్తి

సురేంద్రనగర రాజవంశానికి జాథోజీభట్టు అనే పురోహితుడు ఉండేవాడు. ఆయనకు తొంభై సంవత్సరాల వయసు వచ్చింది. ఆయన దివాణానికి వెళ్ళడం మానుకుని, ఏడాదికొకసారి వార్షికం పుచ్చుకోవటానికి మాత్రమే వెళుతూ ఉండేవాడు. ఆయన స్థానంలో ఆయన తమ్ముడి కుమారుడు వల్లభజీ అనేవాడు రాజపురోహితుడుగా పని చేస్తున్నాడు.

కొలువు మానుకున్నా జాథోజీభట్టుకు దివాణం వ్యవహారాలలో ఆసక్తి ఏ మాత్రమూ తగ్గలేదు; రోజూ వల్లభజీ ఇంటికి రాగానే దివాణం విశేషాలు అడిగి తెలుసుకుంటూ ఉండేవాడు.

ఒకరోజు ఆయన పూజలో ఉండగా వల్లభజీ ఇంటికి వచ్చి, రాజకుమారులు తమ రాజ్యాన్ని పంచుకోబోతున్నట్టు చెప్పాడు. అది రెండు నగరాలూ, పన్నెండు గ్రామాలు గల ఆస్తి. సురేంద్ర నగరమూ చూడా అనేవి నగరాలు. రాజకుమారుల పేర్లు అర్జనసింగూ, సబలసింగూ. వారిలో ఒకరికి ఒక నగరంతోబాటు ఆరు గ్రామాలూ, రెండోవాడికి రెండో నగరంతోబాటు మిగిలిన ఆరు గ్రామాలూ వస్తాయి. కాని ముఖ్య నగరమైన సురేంద్రనగరం తనకు కావాలని ఇద్దరు అన్నదమ్ములూ పట్టుదలగా ఉండటం చేత విభజన నిలిచి ఉన్నది.

జాథోజీభట్టు పూజమాని లేచాడు. పెద్ద వాడైన అర్జనసింగుకు సురేంద్ర నగరం రావాలని ఆ వృద్ధుడి కోరిక. దాన్ని పెద్ద వాడికి ఇచ్చి, రెండోవాడికి ఎలాగైనా చూడా నగరం వచ్చేటట్టు చేయాలని ఆయన నిశ్చయించుకున్నాడు.

మర్నాడు ఉదయం ఆయన దివాణానికి వెళ్ళాడు. తలవని తలంపుగా ఆయన వచ్చినందుకు అందరూ ఆశ్చర్యపడ్డారు. ఒక

గుజరాతీ జానపద కథ

గదిలో రాజకుమారులు మాట్లాడుకుంటూంటే జాథోజీభట్టు అక్కడికి వెళ్ళాడు.

"శ్రమపడి మీ రెందుకు వచ్చారు? కబురు పెడితే మేమే మీ వద్దకు వచ్చి ఉండే వాళ్ళం గద!" అన్నారు రాజ కుమారులు ఆయనతో.

"మీరు భాగాలు పడుతున్నారని విని మిమ్మల్ని ఆశీర్వదించి పోవటానికి వచ్చాను, నాయనలారా!" అన్నాడు జాథోజీభట్టు.

"భాగాలు ఎలా పడాలో ఇంకా నిర్ణయం కాలేదు. పెద్దవాణ్ణి గనక ముందు ఎన్నుకో వలసినది నేనే నంటున్నాను. కాని సబల్ చిన్న వాడికే ముందు ఎన్నుకునే హక్కు ఉంటుం దంటున్నాడు. ఏది ఉచితమో మీరే చెప్పకూడదా?" అన్నాడు అర్జునసింగు.

"నేను ఎలా చెబుతాను? మీరిద్దరూ నాకు ఒకటే. అదీగాక రాచకార్యాలలో తల దూర్చటం నాకు ఏ మాత్రమూ ఇష్టం లేదు. నే నేదో రామాకృష్ణా అంటూ కాటికి కాళ్ళు చాచుకుని ఉన్నవాణ్ణి," అన్నాడు జాథోజీభట్టు.

"కనక నే మీ నిర్ణయం మాకు అవసరం. మీరు ఎలా చేయమంటే అలా చేస్తాం," అన్నారు రాజకుమారులు.

"మీ కొక చిన్న కథ చెబుతాను. శ్రద్ధగా వినండి. పూర్వం ఒక ఋషి వద్ద ఇద్దరు శిష్యులుండేవారు. వాళ్ళు పన్నెండేళ్ళ పాటు గురుశుశ్రూష చేసి ఆయన వద్ద నేర్చుకో దగిన దంతా నేర్చుకుని, వెళ్ళిపోవటానికి గురువుగారి అనుమతి కోరారు. అప్పుడా



ఋషి అగ్నికుండం నుంచి కొంచెం బూడిద తీసి, ఇద్దరు శిష్యుల చేతిలోనూ ఉంచాడు. ఒక శిష్యుడు వెంటనే ఆ బూడిదను నోట వేసుకుని మింగాడు. రెండోవాడు దాన్ని అవతల పారేశాడు. బూడిద మింగిన శిష్యుడు అఖండ పండితుడై సుఖంగా జీవించాడు. రెండోవాడు మందమతి అయిపోయి, తనకు సరిగా విద్య చెప్పలేదని గురువును నిందించాడు. అలా మీరు నన్ను నిందించకుండా ఉండేటట్టయితే, మీరు భాగాలు పడటానికి నేను రేపు మీకు ఒక మార్గం చెబుతాను," అన్నాడు జాధోజీభట్టు.

మర్నాడు ఉదయం ఆయన చెప్పిన పద్ధతిలో విభాగాలు పడటానికి రాజకుమారులిద్దరూ ఒప్పుకున్నారు. జాధోజీభట్టు ఇంటికి వెళ్ళిపోయి, "మంచి శిష్యుడిలాగా ప్రవర్తించు. అంతా సవ్యంగా జరిగిపోతుంది," అని అర్జునసింగుకు ఒక చీటీ పంపాడు.

మర్నాడు ఉదయం ఆయన రాజభవనానికి వచ్చాడు. ఇతరులు ఎవరూ లేకుండా ఆయన వెంట రాజకుమారులిద్దరూ ఒక గదిలో చేరారు. జాధోజీభట్టు రెండు మడిచిన కాగితాలు తీసి, "వీటిమీద సురేంద్ర నగరం అనీ, చూడా అనీ రాశాను. మీ రిద్దరూ చెరొక కాగితమూ తీయండి. ఎవరికి ఏ నగరం పేరు గల చీటీ వస్తే ఆ నగరమూ, దానికి చెందిన ఆరు గ్రామాలూ తీసుకోండి," అన్నాడు.

అర్జునసింగు చప్పున ఒక చీటీ తీసి, దాన్ని విప్పి చూడకుండానే నోట్లో వేసుకుని మింగేశాడు,

సబలసింగు ఆశ్చర్యంతో, "అందులో ఏమిరాసి ఉన్నదీ చూడలేదే!" అన్నాడు.

"దానిదేముంది? నీ చీటీ మీద రాసి లేని నగరం నాదే గదా!" అన్నాడు అర్జునసింగు.

సబలసింగు తన చీటీ విప్పి చూస్తే దాని మీద "చూడా" అని రాసి ఉన్నది.

ఆ ప్రకారమే రాజ్యవిభజన జరిగిపోయింది. ముసలివాడు రెండు చీటీల మీదా "చూడా" అనే రాసి మోసం చేశాడని సురేంద్రనగరంలో ఇప్పటికీ చెప్పుకుని నవ్వుకుంటారు.



# వంటవాడి తంటా

ఒక నవాబు ఒకనాడు ఒక అమీరుగారింటికి విందుకు వెళ్ళాడు. నవాబుగారికి జిహ్వా చాపల్యం జాస్తి. ఆయన ప్రతి పూటా అమిత రుచికరమైన వంటకాలను, నిపుణులైన వంట వారి చేత చేయించుకుని తినేవాడు. కాని ఈ అమీరుగారింట భోజనం నవాబుగారు రోజూ తినే భోజనం కన్న ఎంతో రసోపేతంగా ఉన్నది.

"ఈ వంటవాడు మా రాజభవనంలో ఉండవలిసిన వాడు. వాణ్ణి నాకు ఇచ్చెయ్యండి," అని చెప్పి నవాబు ఆ వంటవాణ్ణి తన వెంట తీసుకుపోయి, వాడికి నెలకు యాభై మొహరీల జీతం ఏర్పాటు చేశాడు. అది నవాబుకు దండగ అనిపించలేదు. ఎందు చేతనంటే, వాడి వంట నిజంగా అద్భుతం. అందుచేత, కొంతకాలం గడిచాక నవాబు వాడి జీతం నెలకు వంద మొహరీలు చేశాడు.

ఇలా చేసిన తరవాత నవాబు తినే వంటకాల రుచి తగ్గిపోయినట్టు కనిపించింది. త్వరలోనే ఆ సంగతి రూఢి అయింది. జరుగుతున్న దేమిటో తెలుసుకోవాలని నవాబు ఒక సారి వంటసాలకు వెళ్ళాడు. అక్కడ వంటవాడు ఒక ఆసనంలో కూర్చుని హుక్కా తాగు తున్నాడు. ఇద్దరు కొత్తవాళ్ళు వంట చేస్తున్నారు. "వీళ్ళెవరు?" అని నవాబు వంటవాణ్ణి అడిగాడు. "నా నౌకర్లు," అన్నాడు వంటవాడు.

"నిన్ను వంటవాడుగా పెట్టుకున్నాను గాని, వంటవాళ్ళ యజమానిగా పెట్టుకో లేదు. నీ జీతం పెంచటం నాదే పొరపాటు," అని నవాబు వంటవాడి జీతం మళ్ళీ తగ్గించేశాడు.

—రాజారెడ్డి.





# దయ్యాల చెరువు

పూర్వం మాంథవి అనే గ్రామాన్ని ఆనుకుని ఒక పెద్ద చెరువు ఉండేది. మండు వేసవిలో కూడా నీరు తరగని ఆ చెరువు ఆ గ్రామానికి ప్రాణాధారంగా ఉండేది. పొలాలకూ, పశువులకూ, స్నానాలకూ, తాగటానికీ గ్రామస్థులు ఆ చెరువు నీరే ఉపయోగించేవారు.

ఊరి శ్మశానం ఆ చెరువుకు ఉత్తరంగా ఉండేది. అక్కడ దహనమైన వారందరూ దయ్యాలై ఆ చెరువునే ఆశ్రయించి ఉంటారని నమ్మి, ప్రజలు దాన్ని దయ్యాల చెరువు అని పిలిచేవారు. బతికి ఉన్న వారికే గాక చచ్చిపోయిన వారికి కూడా ఆ చెరువు ఉపయోగపడేదన్నమాట! చీకటి పడ్డ తరవాత గ్రామస్థులెవరూ చెరువు చాయలకు వెళ్ళేవారు కారు.

ఊళ్ళో ఉండే దుర్మార్గుడు ఎవరన్నా విద్దూరంగా చస్తే దయ్యాలే వాణ్ణి శిక్షించాయనీ, గ్రామానికి పీడవిరగడ అయిందనీ, అవి మంచి వారి జోలికి రావనీ గ్రామస్థులు నమ్మి తృప్తి పడేవారు.

ఆ గ్రామంలోనే మారీచ అనే ఒక విచిత్రమైన మనిషి ఉండేవాడు. అతని భార్య చాలా అందమైనది. ఆమె అంటే మారీచకు పంచప్రాణాలు. అతను ఏ పనీ చేసేవాడు కాడు. అతని భార్య కూలీ నాలీ చేసి తననూ తన భర్తనూ కూడా పోషించేది.

మారీచ భార్య జబ్బుచేసి అకాలమరణం వాతపడింది. తన భార్య చనిపోయిందని తెలియగానే మారీచ దుఃఖంతో స్పృహతప్పి పడిపోయాడు. స్పృహ లేనిసమయంలో అతనికి ఒక దృశ్యం కనిపించింది. అనేక దయ్యాలు తన భార్యను ఊరి చెరువు కేసి లాక్కుపోయాయి.

ఆ దృశ్యం మారీచకు ఎంత వాస్తవంగా తోచిందంటే, అతను స్పృహ వస్తూనే

బూర్లె నాగేశ్వరరావు

లేచి నిలబడి, తన భార్యను పేరు పెట్టి పిలుస్తూ చెరువు కేసి పరిగెత్తాడు. అతనికి మతి చెడిపోతుందో, దయ్యమే పడుతుందో అని ఊళ్ళోవాళ్ళు భయపడ్డారు.

మారీచ భార్య శవాన్ని శ్మశానానికి తీసుకుపోయి దహనం చెయ్యటం చాలా కష్టసాధ్యమయింది. "నా పెళ్ళాం చచ్చిపోలేదు. తగలెయ్యకండి!" అని మారీచ వెర్రిగా కేకలు పెట్టాడు, జుట్టు పీక్కున్నాడు. అందరూ అతన్ని చూసి జాలిపడ్డారు. కాని అతని మతి పూర్తిగా చలించిపోయింది.

మారీచకు పూర్తిగా పిచ్చి అవతారం వచ్చేసింది. ఏ ఆడది ఎదురైనా తన భార్యేనేమోనని మొహంలో మొహం పెట్టి చూసేవాడు; మగవాళ్ళను చూసి, "నువ్వేనా నా పెళ్ళాన్ని చెరువుకు లాక్కుపోయింది? నిజం చెప్పు!" అని అరిచేవాడు. అతనికి ఎదురు పడటం ఊళ్ళోవాళ్ళకు భయమయింది. అతను వీధిలో వస్తున్నట్టు తెలిస్తే అందరూ తలుపులు మూసుకునేవారు. మారీచ ఏనాడో తాను కూడా దయ్యమై ఊరిని వేధిస్తాడేమోనని కూడా కొందరికి భయంగా ఉండేది.

భూతవైద్యుల చేత మారీచకు చికిత్స చేయిస్తే మంచిదని కొందరు అన్నారు. కాని మరికొందరు, అందువల్ల మరింత ప్రమాదం కొని తెచ్చుకోవటం అవుతుందనీ, చెరువులో ఉన్న దయ్యాలన్నీ ఊరి మీద పడవచ్చుననీ అన్నారు.



తిండీ తిప్పలూ మాని మారీచ చెరువు పక్కన ఉన్న శ్మశానంలో తిరగటం ప్రారంభించాడు. అతను తన భార్యను దహనం చేసిన చోట కూర్చుని ఏడ్చేవాడు. నక్కలన్నీ అతని చుట్టూ మూగేవి. వాన వచ్చినా అతను శ్మశానం వదిలి ఇవతలికి రావటం మానేశాడు. అతను రాత్రిళ్ళు అక్కడే నిద్రపోయేవాడు.

ఒకసారి మారీచకు ఒక దృశ్యం కనబడింది. చెరువులో నుంచి అనేక ఆకారాలు పైకి లేచి కోలాహలం చేస్తున్నాయి. అవి దయ్యాలేననీ, వాటి మధ్య తన భార్య కూడా ఉండవచ్చుననీ తోచి, అతను నీటి ఒడ్డుకు పరిగెత్తిపోయి, తన భార్యను పేరు పెట్టి పిలిచాడు.

ఆ కేక విని కొన్ని దయ్యాలు అతన్ని సమీపించాయి.

"మీరే నా భార్యను తీసుకు పోయారు. ఆమెను నాకు వెంటనే చూపండి. నేను మీకేం ద్రోహంచేశాను?" అన్నాడు మారీచ దయ్యాలతో.

"మేము నీ భార్యను తీసుకు పోయిన మాట నిజమే. అది మా కర్తవ్యం. కాని రెండు రోజుల క్రితం నీ భార్య మళ్ళీ చనిపోయింది. ఎలా చూపమన్నావు?" అన్నాయి దయ్యాలు.

"అబద్ధం! అబద్ధం! ఈ మోసపుమాటలు ఎవరైనా నమ్ముతారా? ఇంత విడ్డూరం ఎక్కడైనావుందా! దయ్యాలు చావటం ఏమిటి?" అన్నాడు మారీచ.



"మాకూ చావుంటుంది. నువు నీ భార్య కోసం ఏడిచి కృశించినట్టే, నీ భార్య కూడా కృశించి చచ్చిపోయింది. మేమంతా ఇవాళే బేతాళుడి ఆజ్ఞ మీద ఈ చెరువు విడిచి మరొక చోటికి పోతున్నాం. మాలో నీ భార్య లేదు, కావలిస్తే చూసుకో!" అన్నాయి దయ్యాలు.

"అయితే, చచ్చిపోయిన నా భార్య ఏమయింది? దాచకుండా నిజం చెప్పండి," అని మారీచ అడిగాడు.

"ఈ చెరువులోనే చేపరూపం ధరించి నీ భార్య తిరుగుతున్నది. మేమే ఆమెను పోల్చలేము. నువు ఆమె మాట మరిచి పోవచ్చు," అంటూ దయ్యాలు వెళ్ళి పోయాయి.

"ఏ రూపంలో ఉన్నా నా భార్యను పోల్చ గలను," అన్నాడు మారీచ.

మర్నాడు అతను ఊళ్ళోకి వెళ్ళి ఒక వల తెచ్చి, చెరువులో చేపలను పట్టి, ఒక్కొక్క చేపనే పరీక్షించి పక్కన పెట్ట నారంభించాడు. ఇది చూసి గ్రామస్థులు చేపలను కొంటామని వచ్చారు. కాని మారీచ వాళ్ళ మాటలు వినిపించుకోలేదు. అతను చేపలను పరీక్షించటంలో నిమగ్నుడయాడు.

ఊళ్ళో వాళ్ళు తమకు కావలసిన చేప లను తీసుకుని, డబ్బులు అక్కడ పడేసి వెళ్ళిపోసాగారు. సాయంత్రం అయే సరికి అతను పట్టిన చేపల కుప్పపోయి డబ్బుల కుప్ప మిగిలింది.

మారీచకు తన భార్య దొరుకుతుందన్న ఆశ పోలేదు. అతను రోజూ చెరువులో వల వేసి చేపలుపట్టి ప్రతి ఒక్క చేపనూ పరీక్షిస్తూ జీవితం గడిపాడు. భార్య తిరిగి దొరుకుతుందన్న ఆశే అతనికి జీవితం మీది విరక్తిని పోగొట్టి, మామూలు మనిషిగా మార్చింది.

మారీచ మారాడనీ, తిరిగి ప్రపంచంలో పడ్డాడనీ గ్రామస్థులు అనుకున్నారు. చెరు వులో ఉండిన దయ్యాలను వెళ్ళగొట్టాడన్న కీర్తి కూడా అతనికే దక్కింది. ఆ చెరువుకు దయ్యాలచెరువు అన్న పేరు క్రమంగా పోయింది.






"తమ్ములారా, మనం ఇక ఏడాది పాటు అజ్ఞాతవాసం చెయ్యవలసి ఉన్నది. ఈ ఏడాది పాటు మన జాడ ఎవరికీ తెలియఃగూడదు. మనం ఈ అజ్ఞాతవాసం ఏ దేశంలో చేద్దాం?" అని ధర్మరాజు అడిగాడు.

"పాంచాల, చేది, మత్స్య, శూరసేన, పటచ్చర, వీశార్ణ, నవరాష్ట్ర, మల్ల, సాల్వ, యుగంధర, కుంతి, సురాష్ట్ర, అవంతి దేశాలు పాడి పంటలతో తులతూగుతున్నవి. వాటిలో ఏ దేశంలోనైనా మనం అజ్ఞాతవాసం చెయ్య వచ్చు. ధర్మదేవత అనుగ్రహం ఉన్నది గనక మన అజ్ఞాతవాసానికి భంగం కలగదు," అన్నాడు అర్జునుడు.

"మత్స్యదేశాన్ని పాలించే విరాటుడు ధర్మ శీలుడూ, బలవంతుడూ, మన మేలు కోరేవాడూనూ. మనం ఏడాది పాటు అతని వద్ద కొలువు చేద్దాం. మీరందరూ ఏయే వృత్తులు అవలంబించదలిచారు ?" అని ధర్మరాజు మిగిలిన వారిని అడిగాడు.

అర్జునుడు విచారంగా, "అన్నా, మామాట కేమిటి గాని, ఎవరికీ ఎన్నడూ సేవ చేసి ఎరగని నువు విరాటుణ్ణి ఏ విధంగా కొలుస్తావు? ఆ మాట తలుచుకుంటేనే మాకు తహ తహ పుట్టుతున్నది," అన్నాడు.

దానికి ధర్మరాజు, "నేను బ్రాహ్మణ వేషం ధరించి, కంకుడు అని పేరు పెట్టుకుని విరాటుడి సభలో చేరిపోతాను. పాచికల ఆటతో రాజునూ, మంత్రులనూ, సామంతులనూ రంజింపజేస్తాను. ఇంతకు పూర్వం ఏం చేసేవాడివని అడిగితే ధర్మరాజుకు ప్రాణ

## 38. అజ్ఞాతవాసారంభం



స్నేహితుడుగా ఉండేవాణ్ణి అని చెబుతాను," అని భీముడి కేసి తిరిగి, "భీమసేనా, విరాటుడి వద్ద నువు ఏం పని చెయ్యదలిచావు?" అని అడిగాడు.

"నాకు వంట చెయ్యడంలో నేర్పున్నది. వల్లవుడని పేరు పెట్టుకుంటాను. విరాటుడు ఏనాడూ తినని వంటకాలు తినిపిస్తాను. ఆయుధం లేకుండా కట్టెలు చీల్చి, పెద్ద పెద్ద కట్టెల మోపులను అవలీలగా మోసి, రాజు ఎలాటి సాహస కార్యాలకైనా నన్ను నియోగించేటట్టు చేస్తాను. రాజుగారి వినోదం కోసం ఎలాటి మల్లులనైనా జయిస్తాను. పూర్వం ఏం చేసేవాడివని అడిగితే ధర్మరాజు దగ్గిర బానిసగా ఉండేవాణ్ణి అని చెబుతాను. నేను బయట పడకుండా జాగ్రత్త పడతాను, మీరేమీ విచారించకండి," అన్నాడు భీముడు.

అర్జునుడి సమస్య అదివరకే తేలిపోయింది. అతన్ని నపుంసకుడు కమ్మని ఊర్వశి శపించగా, ఇంద్రుడు ఆ శాపాన్ని అర్జునుడు అజ్ఞాతవాస కాలంలో అనుభవించేటట్టు అనుగ్రహించాడు.

"నేను బృహన్నల అనే పేరు పెట్టుకుని, నా ముంజేతికి కాచిన కాయలు కనపడకుండా కంకణాలు తొడుక్కుని, ఆడదీ మగవాడూ కాని అవతారంతో విరాటుడి అంతఃపురం ప్రవేశించి, నాట్య సంగీతాలతో అంతఃపురస్త్రీలను రంజింప జేస్తాను. నువు పూర్వం ఏంచేసేదానివి అని అడిగితే ద్రౌపదికి పరిచర్యలు చేసేదాన్ని అని చెబుతాను," అన్నాడు అర్జునుడు.

"నేను దామగ్రంథి అని పేరు పెట్టుకుని విరాటుడి గుర్రాలకు శిక్షకుడుగా పని చేస్తాను. గుర్రాల జబ్బులకు చికిత్స చేస్తాను. నాకు అశ్వవైద్యం బాగా తెలుసు గద. పూర్వం ధర్మరాజు దగ్గిర అశ్వాధికారిగా ఉండేవాణ్ణి అని చెబుతాను," అని నకులుడు అన్నాడు.

"తంత్రీపాలుడనే పేరు పెట్టుకుని విరాటుడి గోవులను పాలిస్తాను. నేను పూర్వం నీ ఆజ్ఞమీద ఈ పని చేసినవాణ్ణే గనక కొత్త

ఏమీ కాదు. నాకు ఆవులను గురించీ, ఆబోతులను గురించీ తెలియనిది ఏమీ లేదు," అన్నాడు సహదేవుడు.

ద్రౌపది ఏమి చేస్తుందనేది ధర్మరాజును బాధించింది. ఆమె సేవలు అందుకున్నదే గాని, సేవలు చేసినదికాదు. సుకుమారి, భర్తల అండన జీవించిన పతివ్రత.

ధర్మరాజు విచారం చూసి ద్రౌపది, "నా కోసం విచారం దేనికి? సైరంధ్రి వృత్తి అనేది గౌరవనీయమైనది. ఇతర దాసీలను చూసినట్టు సైరంధ్రిని లోకువగా చూడరు. అలాటి వృత్తిలో నేను స్త్రీలకు తలలు దువ్వి రకరకాల ముడులు వేస్తూ, విరాటుడి భార్య అయిన సుధేష్ణ వద్ద రహస్యంగా జీవిస్తాను," అన్నది.

తమ్ములూ, ద్రౌపదీ చేసిన నిర్ణయాలతో ధర్మరాజు తృప్తి చెందాడు. ఆయన ధౌమ్యుణ్ణీ, సూతులనూ, ఇతర పనివారినీ ద్రుపదుడి వద్దకు వెళ్ళమన్నాడు; ఇంద్రసేనుడు మొదలైన మంత్రులను ఖాళీ రథాలతో ద్వారకకు వెళ్ళమన్నాడు; పాండవులు ఎటు వెళ్ళారో మాకు తెలియదని చెప్పమని అందరినీ హెచ్చరించాడు.

రాజుల వద్ద సేవ చేసేవారు తెలుసుకోదగిన ధర్మాలన్నిటినీ ధౌమ్యుడు పాండవులకు బోధించాడు. ఎవరి దారిన వారు వెళ్ళిపోగా పాండవులు తమ ఆయుధాలన్నిటినీ



వెంట తీసుకుని ద్వైతవనం నుంచి బయలుదేరారు. వాళ్ళు వనాలూ, కొండలూ దాటి వెళ్ళి మత్స్యదేశం ప్రవేశించారు. ఆ మత్స్యదేశం దశార్ణదేశాలకు ఉత్తరానా, పాంచాలానికి దక్షిణానా, శూరసేన దేశాలకు మధ్యనా ఉన్నది.

ద్రౌపది మిగిలిన వాళ్ళతో, "ఇక్కడ పొలాలూ, దారులూ చాలా కనిపిస్తున్నాయి. విరాటనగరం ఇంకా చాలా దూరం ఉండవచ్చు. నేను అలిసి పోయాను. ఈ రాత్రి గడిచే వరకూ, ఈ అరణ్యంలోనే ఉండి పోదాం," అన్నది.

ధర్మరాజు అడవి దాట నిశ్చయించి, ద్రౌపదిని మోసుకురమ్మని అర్జునుడితో



ఒకవేళ వచ్చినా, జమ్మిచెట్టు పైభాగం ఎవరికీ కనిపించదు. అందుచేత తమ ఆయుధాలను ఆ చెట్టుకొమ్మల గుబుళ్ళమధ్య దాచటానికి అర్జునుడు నిశ్చయించాడు.

పాండవులందరూ తమ ధనుస్సులను ఎక్కుదించి నేలపైన ఉంచారు. తమ ఖడ్గాలను కూడా ధనుస్సులతో చేర్చారు. ధర్మరాజు ఆజ్ఞాపించగా నకులుడు జమ్మిచెట్టు మీదికి ఎక్కి, వర్షపు నీరు కూడా పడనంత దట్టమైన ఆకుల మధ్య ఆయుధాలను దాచి, వాటి మీద ఒక శవాన్ని కప్పాడు.

శవాన్ని చెట్టు మీదికి ఎక్కించటం దూరం నుంచి గొల్లవాళ్ళు ఎవరో చూసినట్టున్నారు. పాండవులు వాళ్ళతో, "నూట ఎనిమిదేళ్ళ వయసు గల మా తల్లి చచ్చిపోయింది. మా కులాచారం ప్రకారం శవాన్ని చెట్టు మీద ఉంచాము," అని చెప్పారు.

తరవాత వాళ్ళు విరాటనగరం కేసి బయలుదేరారు. వారు తమలో తాము ఉపయోగించుకోవటానికి జయుడూ, జయంతుడూ, విజయుడూ, జయత్సేనుడూ, జయద్బలుడూ అనే పేర్లు పెట్టుకున్నారు.

విరాటనగరానికి వెళ్ళే దారిలో ధర్మరాజు దుర్గను ధ్యానించి, "తల్లీ, నీవే మాకు శరణు. మమ్మల్ని కాపాడి కనిపెట్టి ఉండు," అని వేడుకున్నాడు. ఆ దేవి తన

అన్నాడు. ఆ విధంగా వాళ్ళు విరాటనగరం పొలిమేర చేరారు.

అప్పుడు ధర్మరాజు తమ ఆయుధాలను గురించి ఆలోచించాడు. వాటితో నగరం ప్రవేశించటానికి లేదు. పై పెచ్చు, అర్జునుడి గాండీవం ప్రపంచానికంతకూ తెలిసిన ఆయుధం. పాండవులను పట్టి ఇవ్వటానికి అది ఒకటే చాలు. అందుచేత ఆయుధాలన్నిటినీ దాచటానికి తగిన చోటు వెతకమని ధర్మరాజు అర్జునుడితో అన్నాడు.

అర్జునుడు నాలుగు వైపులా కలియజూశాడు. అతనికి శ్మశానమూ, అందులో విపరీతంగా పెరిగిపోయిన జమ్మిచెట్టూ కనిపించాయి. ఆ ప్రాంతానికి ఎవరూ రారు.

దివ్యరూపంతో ప్రత్యక్షమై, "త్వరలోనే
నువ్వు యుద్ధంలో విజయం పొంది, సుఖంగా
ఉంటావు," అని దీవించి అంతర్థాన
మయింది.

తరవాత ధర్మరాజు ఒక నదిలో స్నానం
చేసి, చేతులు మోడ్చి ధర్మదేవతను
ధ్యానించి, "యక్షుడుగా నా కిస్తానన్న వరం
ఇప్పుడు కోరుకుంటున్నాను," అన్నాడు.

వెంటనే చిత్రంగా ఆయనకు కాషాయ
వస్త్రాలతోనూ, కమండలంతోనూ సహా యతి
వేషం వచ్చేసింది. మిగిలిన వారి వేషాలకు
తగిన పరికరాలన్నీ పక్కనే ప్రత్యక్ష
మయాయి. అందరూ ఒక్కసారిగా వాటి
మీద పడి, ఎవరికి కావలసినవి వారు తీసు
కుని, తమ తమ వేషాలు తాము చేయ
బోయే పనులకు అనుగుణంగా మార్చు
కున్నారు.

ధర్మరాజు పాచికలను తన ఉత్తరీయం
కొంగున కట్టుకుని, విరాటరాజు కొలువు దీరి
ఉన్న సభకు వెళ్ళాడు. యతివేషంలో
ఉన్నప్పటికీ ధర్మరాజును చూసి విరాటుడు
ఆయన తేజస్సుకు నివ్వెరపోయాడు. ఆయన
వెంట పరివారం ఉన్నట్టయితే చక్రవర్తి
అన్న భావం విరాటుడికి కలిగి ఉండేదే.

ధర్మరాజు విరాటుణ్ణి సమీపించి, "రాజా,
నేను సమస్తమూ కోల్పోయి, కొంత కాలం
నీ కొలువులో ఉండగోరి వచ్చాను. మాది
వైయాఘ్రపద గోత్రం. నా పేరు కంకుడు.
నేను పూర్వం ధర్మరాజు వద్ద ఆయన ఆప్త
డుగా ఉండేవాణ్ణి. జూదంలో నేను ధర్మ





రాజుతో ఓడితే ఆయన నన్ను ఎన్నడూ ధనం అడిగేవాడు కాడు. మీరు కూడా నన్ను అలాగే చూసుకోవాలి," అన్నాడు.

ఆ మాటకు విరాటుడు, "నా పరివారంలో ఎవరైనా నీకు అప్రియం చేస్తే వారిని దండిస్తాను. నిన్ను ఎవరన్నా ధన ధాన్యాదులు యాచిస్తే నాకు చెప్పు. నేను వాటిని వారికి ఇస్తాను. అందరూ నన్ను చూసినట్టే నిన్ను చూస్తారు," అన్నాడు.

మరి కొంతసేపటికి నల్లని బట్టలు ధరించి భీముడు రాజు వద్దకు వచ్చాడు. అతనికి ఒక చేతిలో గరిటె, మరొక చేతిలో కత్తి ఉన్నాయి. అతను విరాటుణ్ణి సమీపించి, "రాజా, నేను వంటలవాణ్ణి. నా పేరు వలవుడు. నన్ను నియమించినట్టయితే రకరకాల పంటకాలు చేసి పెట్టగలను," అన్నాడు.

"నిన్ను చూస్తే వంటలు చేసే వాడివని నమ్మశక్యం కావటం లేదు," అన్నాడు విరాటుడు.

"నా వంట నేర్పు ధర్మరాజుకు తెలుసును. బలంలో కూడా నేను అందరినీ మించినవాణ్ణి. మీరు వినోదించాలంటే ఏనుగులతోనూ, సింహాలతోనూ పోరాడగలను," అన్నాడు భీముడు.

"సరే, నువు మా పాకశాలలో పెద్ద వంటవాడుగా పని చెయ్యి," అని విరాటుడు భీముణ్ణి తన వంటసాలకు పంపేశాడు.

ఈ లోపల ద్రౌపది మాసిన బట్ట కట్టి, జుట్టు విరబోసుకుని, సైరంధ్రీ వేషంలో వీధుల వెంట తిరుగుతూ ఉండగా, నగరవాసులు, "అమ్మా, నువు ఎవరు? ఏం చేస్తూంటావు?" అని అడిగారు.

వారితో ద్రౌపది, "నేను సైరంధ్రిని. ఎవరన్నా నన్ను పోషిస్తే వారికి కావలసిన సేవలు చేస్తాను," అంటూ వచ్చింది.

రాజభవనం పై భాగాన విహరిస్తున్న సుధేష్ణరాణి ద్రౌపదిని చూసి, పిలిపించి, "నువు ఎవతెవు? ఏం పని చేస్తావు?" అని అడిగింది.

"దేవీ, నేను సైరంధ్రిని. నాకు జుట్టు ముడులు వెయ్యటమూ, వంటి పూతలు

తయారు చెయ్యటమూ, తలలో పూలు అమర్చటమూ, పూలమాలలు కట్టటమూ చేతనవును. కృష్ణుడి భార్య అయిన సత్యభామనూ, పాండవుల భార్య అయిన ద్రౌపదినీ మెప్పించిన దాన్ని. ద్రౌపది నన్ను మాలిని అని పిలిచేది." అని ద్రౌపది ఎంతో వినయంగా అన్నది.

"నువ్వు చూడబోతే ఆడవాళ్ళనే ఆకర్షించేటంత అందంగా ఉన్నావు. మా మహారాజు నిన్ను చూసినాక మళ్ళీ నా మొహం చూడడేమోననిపిస్తున్నది. ఆయన నీ దాసుడై పోతాడేమోనన్న అనుమానంతో నిన్ను మా అంతఃపురంలో పెట్టుకోవటానికి భయపడుతున్నాను," అన్నది రాణి సుధేష్ణ.

"మహారాణీ, నన్ను విరాటరాజుగాని మరొకరుగాని ఏమీ చేయలేరు. మహా బలవంతులైన అయిదుగురు గంధర్వ రాజకుమారులు నా భర్తలు. వారు నన్ను అనుక్షణమూ కనిపెట్టుకుని ఉంటారు. నన్ను కాళ్ళు కడగటంలాంటి పనులు చెప్పకుండా, ఎంగిలి తినమనకుండా ఉంటే నేను ఎంతో ప్రీతితో కొలుస్తాను. నన్ను మామూలు స్త్రీ కింద చూసి నా జోలికి వచ్చిన వారినిమాత్రం నా భర్తలు రాత్రికి రాత్రే చంపిపారేస్తారు," అన్నది ద్రౌపది.

ఆ మాటమీద సుధేష్ణ ద్రౌపదిని తన ఇంట ఉండనిచ్చింది.



తరవాత నపుంసకుడి రూపంలో అర్జునుడు విరాటరాజు వద్దకు వచ్చాడు. అతను ముదురు ఎరుపు రంగు బట్టలు ధరించి ఉన్నాడు. అతను సభికులను దాటివెళ్ళి రాజును సమీపించి, "మహారాజా, నా పేరు బృహన్నల. నాట్య కళలలో నాతో సరితూగే వాళ్ళులేరు. నాకు జడలు వెయ్యటమూ, పూలు పెట్టటమూ కూడా వచ్చు," అన్నాడు.

విరాటుడు నమ్మలేక, "నీ పొడుగాటి చేతులూ, ఎగు భుజాలూ చూస్తూంటే గొప్ప విలుకాడిలాగా ఉన్నావు," అన్నాడు.

"లేదు, మహారాజా. విల్లు ఎలా ఉంటుందో కూడా నాకు తెలీదు. సంగీతం పాడతాను. వీణా, మృదంగమూ వాయి

స్తాను. నాట్యం చెయ్యగలను," అన్నాడు అర్జునుడు.

విరాటుడు తన కూతురైన ఉత్తరను పిలిపించి, "తల్లీ, ఈమె బృహన్నల. ఇకనుంచీ నువ్వు ఈమె వద్దనే నాట్యం నేర్చుకో," అని చెప్పాడు. అర్జునుడు ఉత్తర వెంట అంతఃపురానికి వెళ్ళిపోయాడు.

తరవాత కొంత సేపటికి విరాటుడు తన గుర్రాలను చూడబోయేసరికి, నకులుడు గుర్రాల కేసి పరీక్షగా చూస్తూ కనిపించాడు. ఆయన తన వారితో, "ఆ యువకుడికి గుర్రాల సంగతి తెలిసినట్టున్నది. అతన్ని సభకు పంపండి," అని తాను అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

నకులుడు సభలో ఆయన దర్శనం చేసుకుని, "మహారాజా, బతుకు తెరువు కోసం మీ దేశం వచ్చాను. నన్ను తమ గుర్రాలకు యజమానిగా పెట్టుకోండి. నాకు పొగరుమోతు గుర్రాలను లొంగదీయటమూ, గుర్రాల జబ్బులు నయం చెయ్యటమూ తెలుసు. ఒకప్పుడు ధర్మరాజుగారి అశ్వాలను పాలించేవాణ్ణి. నా పేరు దామగ్రంథి," అన్నాడు.

విరాటుడు అతని మాటలకు తృప్తిపడి, అతన్ని తన గుర్రాలకూ, రథాలకూ అధిపతిగా నియమించాడు.

మరి కొంతసేపటికి సహదేవుడు సభ దగ్గిరికి వచ్చాడు. అతను అచ్చమైన గొల్లవాడి వేషంలో, పూలదండలు వేసుకుని, తాళ్ళు పట్టుకుని, పొడుగైన వేణువు చేత బట్టి ఉన్నాడు. అతను రాజును సమీపించి, "మహారాజా, నేను మీ గోవులకు చోరబాధా, రోగబాధా లేకుండా చూసి, పాలు మరింతగా ఇచ్చేటట్టు చూడగలను. నేను అరిష్టనేమి అనే వైశ్యుణ్ణి. ధర్మరాజు గారి కోటి గోవులు నా అధీనంలో ఉండేవి. నన్ను తంత్రీపాలుడని పిలుస్తారు," అన్నాడు.

విరాటుడు తృప్తిపడి, సహదేవుణ్ణి తన గోపాలకుడుగా నియమించాడు.

ఈ విధంగా పాండవులు అయిదుగురూ విరాటుడి అండచేరి తమ అజ్ఞాతవాసం ప్రారంభించారు.





# శివపురాణం

## 15

ఇరవై ఒక్క మంది గణాధిపతులకూ, విశ్వ దర్మ అనే ఉపబ్రహ్మ కుమార్తెలకూ పెళ్ళి జరిగిపోగానే పార్వతి శివుడితో, ''పరమేశ్వరా, నా కొడుకులకు అధికారాలిచ్చి, గజాసురుడికి ఇచ్చిన వరం సార్థకం చెయ్యండి,'' అన్నది.

శివుడు ఆమె కోరిక తీర్చే ఆలోచనలో ఉండగా అక్కడికి కుమారస్వామి వచ్చి, పార్వతీ పరమేశ్వరులతో, తనకు కూడా గణాధిపత్యం ఇప్పించవలసినదని కోరాడు.

''నీకు దేవగణాల మీద అధిపత్యం ఇచ్చి ఉన్నాంగదా, రుద్రగణాల మీద అధికారాన్ని లక్ష్మీగణాధిపతులకు ఇద్దాం. అందుకు ఒప్పుకో,'' అన్నాడు శివుడు.

అందుకు కుమారస్వామి ఒప్పుకోక, తనకు కూడా గణాధిపత్యం కావాలని మొండిగా పట్టుబట్టాడు.

అప్పుడు శివుడు కుమారస్వామికీ, లక్ష్మీ గణాధిపతులలో పెద్దవాడికీ ఒక పోటీ కల్పించాడు. ఆ ఇద్దరూ తమ తమ వాహనాల మీద వెళ్ళి, పుణ్యక్షేత్రాలు చూస్తూ, పుణ్య తీర్థాలలో స్నానాలు చేస్తూ, భూప్రదక్షిణం చేసి కైలాసానికి తిరిగి రావాలి. ఎవరు ముందుగా తిరిగి వస్తే వారిది సర్వ గణాధిపత్యం. ఇందుకు వాళ్ళు సమ్మతించారు. శివుడు కుమారస్వామికి వాహనంగా నెమలిని ఇచ్చి, ఎలుక రూపంలో తన వద్ద ఉన్న గజాసురుణ్ణి లక్ష్మీగణాధిపతికి వాహనంగా ఇచ్చాడు. కుమారస్వామి నెమలిని ఎక్కి రివ్వున ఆకాశంలోకి ఎగిరిపోయాడు.

లక్ష్మీగణాధిపతి పార్వతి వద్దకు వెళ్ళి, ''అమ్మా, చూడు నాకు ఎంత అన్యాయం జరిగిందో! కుమారస్వామి బలవంతుడూ, ఆజానుబాహువూనూ. అతనికి నెమలిని వాహ

అట్ట చివరి బొమ్మ



నంగా ఇచ్చారు. మేమంతా పొట్టివాళ్ళము. నేను తల బరువూ, పొట్ట బరువూ పెట్టుకుని, ఎలుక మీద ఎలా ప్రయాణం చెయ్యగలను? ఇలాటి పరీక్ష పెట్టేకన్న మాకు అధికారం ఇచ్చేదిలేదని చెబితే సరిపోయేది గదా!'' అన్నాడు.

''నాయనా, మీ మామ అయిన విష్ణువును ఏదన్నా ఉపాయం అడుగు,'' అని పార్వతి లక్ష్మీగణాధిపతితో అన్నది.

లక్ష్మీగణాధిపతి విష్ణువు వద్దకు వెళ్ళి, తనకు జరిగిన అన్యాయం చెప్పుకుని, ''నేను కుమారస్వామితో పోటీపడి భూప్రదక్షిణం చెయ్యగలనా? కుమారస్వామి అప్పుడే బయలుదేరి వెళ్ళిపోయాడు అన్నాడు.''

విష్ణువు అతనితో, ''బాబూ, విచారించకు. శివపంచాక్షరీ మంత్రం ఐదు లక్షలు జపించి, పార్వతీ పరమేశ్వరుల చుట్టూ మూడుసార్లు తిరిగావంటే నీకు భూప్రదక్షిణ చేసిన ఫలితమూ, తీర్థయాత్రల ఫలితమూ కూడా దక్కుతుంది,'' అన్నాడు.

లక్ష్మీగణపతి అలాగే శుచి అయి, ఒక చోట దర్భాసనం మీద కూర్చుని శివపంచాక్షరి జపించసాగాడు.

ఈలోపల కుమారస్వామి నెమలి వాహనం మీద మొదటి తీర్థాన్ని చేరుకోబోతుండగా అక్కడ లక్ష్మీగణపతి అప్పుడే స్నానం చేసి, తీర్థం నుంచి వెళ్ళి పోతున్నట్టు దూరం నుంచి కనిపించింది. కుమారస్వామి దగ్గిరికి వచ్చి చూసేసరికి, ఇసుకలో ఎలుక పాదాల గుర్తులు కనిపించాయి.

కుమారస్వామి ఆ తీర్థంలో ఉండే వారిని, ''అయ్యా, ఇక్కడికి పెద్ద పొట్ట గల పొట్టి వాడొకడు ఎలుకనెక్కి వచ్చి స్నానం చేసి వెళ్ళాడా?'' అని అడిగాడు.

''అవును, బాబూ, ఇప్పుడే వెళ్ళాడు. అడుగో దూరాన ఇంకా కనిపిస్తూనే ఉన్నాడు. మహా పుణ్యాత్ముడు, మా కందరికీ తలా ఒక సువర్ణమూ దానం చేశాడు!'' అన్నారు వాళ్ళు.

''ఆహా! పొట్టివాడు ఎంత పని చేశాడూ! ఇక్కడ స్నానం చేస్తూ కాలయాపన చెయ్య

రాదు. ముందు వచ్చే తీర్థంలో స్నానం చేస్తాను," అనుకుని కుమారస్వామి ముందున్న క్షేత్రానికి వెళ్ళాడు. కాని అతను అక్కడికి చేరేసరికి లక్ష్మీగణపతి అప్పుడే ఆ తీర్థంలో స్నానం చేసి వెళ్ళినట్టు స్పష్టమయింది!

ఎక్కడికి వెళ్ళినా కుమారస్వామికి ఇదే అనుభవం అయింది. అతను ఏ తీర్థమూ సేవించకుండానే భూప్రదక్షిణం చేసి కైలాసానికి తిరిగి వచ్చాడు. ఈ లోపలనే లక్ష్మీగణపతి శివపంచాక్షరి అయిదు లక్షల సార్లు జపించి, పార్వతీ పరమేశ్వరుల చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేసి, వారి ముందు వినయంగా చేతులు జోడించి నిలబడ్డాడు.

సభలో వాళ్ళందరూ గుసగుసలాడుకుని, "ఈ లక్ష్మీగణపతి భూప్రదక్షిణం చెయ్యకుండానే గణాధిపత్యం సంపాదిస్తాననుకుంటున్నాడు!" అనుకున్నారు.

ఇంతలో కుమారస్వామి తిరిగి వచ్చి, పార్వతీ పరమేశ్వరులతో, "నేను గణాధిపత్యానికి తగను. లక్ష్మీగణపతికే గణాధిపత్యం ఇవ్వండి." అన్నాడు.

శివుడి సభలో ఉన్నవారూ, పార్వతీ పరమేశ్వరులూ కూడా ఆశ్చర్యపడి, "ఎందుకు అలా అంటున్నావు?" అని కుమారస్వామిని అడిగారు.

"నేను ప్రపంచంలో ఉన్న అన్ని క్షేత్రాలకూ వెళ్ళాను. కాని ఏ తీర్థంలోనూ స్నానం చెయ్యలేదు. ఎందుకంటే, ప్రతి తీర్థం



లోనూ ఈ లక్ష్మీగణపతి నా కన్న ముందే స్నానం చేసి వెళ్ళి పోవటం నాకు కనిపించింది. తీర్థాలలో వాళ్ళు కూడా నాకు ఆ మాటే చెప్పారు. అతను నా కన్న మహా శక్తి గలవాడు. రుద్రగణాలకు నాయకుడుగా ఉండటానికి అతనే తగినవాడు,'' అన్నాడు కుమారస్వామి.

సభలో వారందరూ శివపంచాక్షరీ ప్రభావాన్ని గ్రహించి, లక్ష్మీగణపతినే రుద్రగణాలకు అధిపతిగా చెయ్యటానికి ఒప్పుకున్నారు. అతన్ని గణాధిపతిగా అభిషేకించే ప్రయత్నాలు ప్రారంభమయాయి.

రుద్రగణాల వాళ్ళు వెళ్ళి పుణ్యనదీ జలాలూ, సప్త సముద్ర జలాలూ తెచ్చారు. ప్రమథ, భూతగణాలనూ, గరుడ, గంధర్వ, కిన్నర, కింపురుష, నాగ, భూలోకవాసులనూ పిలిపించారు. బృహస్పతి పెట్టిన ముహూర్తాన లక్ష్మీగణపతినీ, అతని భార్య అయిన జయలక్ష్మినీ నవరత్న సింహాసనం మీద కూర్చోబెట్టి, సమస్త గణాల మీదా అతనికి అధిపత్యం ఇస్తూ, తన తమ్ములైన ఇతర గణపతులందరి పైనా అధికారం ఇచ్చారు. అతనికి పార్వతీపరమేశ్వరులు అభిషేకం చేశారు. తరవాత వాళ్ళు లక్ష్మీ గణపతితో, ''నువ్వూ, నీ తమ్ములూ మూడు లోకాలనూ పాలిస్తూ, మిమ్మల్ని తలచిన వారికీ, పూజించినవారికీ, మిమ్మల్ని గురించి తపస్సు చేసినవారికీ సహాయపడుతూ, వారి కార్యాలు సఫలం అయేటట్టు చూడండి,'' అన్నారు.

ఇది ఇలా ఉండగా, తారకాసురుడు చనిపోయిన అనంతరం అతని భార్య, తన కుమారులైన తారకాక్షుడూ, కమలాక్షుడూ, విద్యున్మాలీ అనే ముగ్గురినీ వెంట బెట్టుకుని రసాతలానికి పారిపోయి, అక్కడ వాళ్ళకు శుక్రాచార్యుడి చేత సకల విద్యలూ చెప్పిస్తూ, పెంచి పెద్దవాళ్ళను చేసింది.

ఆ కుర్రవాళ్ళు పెద్దవాళ్ళయాక తమ తండ్రి ఎలా చచ్చిపోయినదీ తెలుసుకున్నారు. అప్పుడు వాళ్ళు మేరు పర్వతం మీదికి పోయి, బ్రహ్మను గురించి దీర్ఘమైన తపస్సు చేశారు.



# 125. కొఫుకుజి పగోడా

జపానులోని "నర" అనే ప్రాచీన నగరంలో ఈ అయిదు అంతస్థుల పగోడా సుమారు 550 ఏళ్ళ క్రితం నిర్మించబడింది. కంచుతో చేసిన దాని "శిఖరం" మెరుపులను నిగ్రహిస్తుంది. ఈ పగోడా ఎత్తు 165 అడుగులు. ముందు కనిపించే కొలను పేరు "నరునవ".



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఇద్దరి మధ్య

పంపినవారు :
పి. కె. నాగేశ్వరరావు

Photo by Brahm Dev



వేటపాలెం.
(ఒంగోలు జిల్లా.)

అంతా మిథ్య

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు ఏప్రిల్ నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జూన్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
జానపద విద్యలు (ఉత్తర ప్రదేశ్)

మూడవ అట్ట:
జానపద విద్యలు (హర్యానా)


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'





టీవియస్ రిట్రెడ్‌లు క్రొత్త టైరులులాగే కన్పిస్తాయి. రిట్రెడింగ్ విధానంలో ప్రత్యేకముగా మేము తీసుకొనే జాగ్రత్తలు క్రొత్త టైరులులాగ కన్పించడానికిగాదు. క్రొత్త టైరులాగ మంచి రోడ్డు గ్రిప్పును ఇచ్చేటట్టు చూస్తాము. అవి చాలాకాలం క్రొత్తవిలాగ మన్నుతాయి.

టీవియస్‌కు ఇచ్చే ప్రతీ టైరూ కూడా ట్రెడ్‌ను వదులుచేసే ఇసుక రేణువులు లేక సున్నితమైన ఇతర బాహ్య పదార్థాలు లేకుండా ఒకసారి, రెండుసార్లు పరీక్ష చేయబడుతుంది. అత్యాధునికమైన రిట్రెడింగ్ మెషీనులమీద మంచి నైపుణ్యతగల సాంకేతిక సిబ్బంది పనిచేస్తారు. మీకు తెలుసా బాగా మన్నడానికని టీవియస్ క్యామెల్ బ్యాక్ రబ్బరును వారే తయారుచేసుకుంటారు. ఆశ్చర్యములేదు టీవియస్ రిట్రెడులు ఇతర వాటికంటె మీరు వెచ్చించే ప్రతీ రూపాయికి అధికంగా టైరు మైళ్ళనిస్తాయి.

మీరు టీవియస్‌ను విశ్వసించవచ్చు—భారతదేశంలో పెద్ద రిట్రెడ్ వ్యాపారస్థులు.







మీరు టీవియస్‌ను విశ్వసించగలరు

సుందరమ్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్

బెంగళూరు-కోయంబత్తూరు-కలమశేరి-మద్రాసు-మదురై-సేలం-సికింద్రాబాద్-తిరునల్‌వేలి-విజయవాడ.

SI 6073

ప్రియమైన నాన్నకు,

గిడ్డు దగ్గర ఒక అందమయిన బొమ్మ ఉంది. వాళ్ళ నాన్న దాన్ని ఆంధ్రా బ్యాంకు నుంచి తెచ్చారు. దాన్ని కిడ్డీ బ్యాంకు బొమ్మ అంటారు. గిడు రోజూ దానిలో డబ్బులు వేస్తుంటాడు. అది ఎంతో చక్కగా గలగలా శబ్దం చేస్తుంది. నాకు అలాంటి బొమ్మ ఒకటి కావాలి. ఒకటి తేవూ నాకు, నాన్నా?

వచ్చే నెల ఆ

నా పుట్టిన రోజు వస్తున్నదని అమ్మ నాతో చెప్పింది.

ప్రియమైన
చిన్ని




## ది ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్




FDS AB 1746 TEA

# టేబీ విమాన దొంగలమధ్య

























